(1) గేయగుచ్ఛము

(2) రైతుబిడ్డ

వలయువారు

సబ్నివీసు గురునాథరావు

రామారావుగార్లు

వినుకొండ, గుంటూరుజిల్లా అని వ్రాయవలయును.



శ్రీ వడ్లమన్నాటి రాజమాంబా లింగయామాత్యుల **ఆత్మజ,**

శ్రీ గొల్లపూడి వేంకటాచలామాత్యుని అర్ధాంగి,

పవిత్రచరిత్ర,

**రా జ్య ల క్ష్మ్యం బి కా**

స్మృతి కిది

అంకితము



# పాత్రలు

**పురుషులు:—**

వెంకయ్య:— కథానాయకుడు.
బాలయ్య:— } రైతులు.
రోశయ్య:— }
కోటయ్య:— }
పోలు:— మాదిగ; గ్రామతలయారి
శంభుశాస్త్రి:— ఈనాందారుడు.
కాంతయ్య:— గ్రామకర్ణం; ప్రైవేటు
లక్ష్మయ్య:— మునసబు.
పున్నిశెట్టి:— సావుకారు.
రంగారావు:— రివిన్యూఇన్‌స్పెక్టరు.
మహమత్‌ఖాన్:— పోరుడు.
రాములు:— వెంకయ్యకొడుకు.
నారాయణరావు:— కర్ణంకొడుకు; బారిష్టరు.
యేడుకొండలు:— ఫ్యాక్టరీమేనేజరు.
భూషణ్:— డాక్టరు.
పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు; కాన్‌స్టేబిల్; గ్రామపనిపాటలవారు; మరికొందరు రైతులున్నూ.

**స్త్రీలు:-**

మంగమ్మ:— కథానాయిక.
భూదేవి:— రాముల భార్య.
కమల:— నారాయణరావుభార్య
రత్నమ్మ:— ఫేక్టరీలో కూలిమనిషి.

# తొలి పలుకు

షేక్స్పియరాదులు వసుంధరను రంగస్థలమనిరి. కావున రంగస్థలమును వసుంధరయనుట తప్పుకాదు. మనుష్యజీవితమున కాటపందిరి వసుమతి యగు. రంగస్థలముకూడ నట్టిదియే యని తెలుపజెల్లును.

మానవజీవితమందలి వివిధాంశములు వివిధాంకములై, కవి హృదయ రంగస్థలమున రూపకరూపమున విజృంభించి, పదపడి ప్రత్యక్షరంగమున బాహ్య ప్రదర్శనమున సువ్యక్తములగును.

* జగతిలో నుండియు జగతి యవ్వలగూడ నధివసించి స్వయంకృత జగన్నాటకమును వీక్షించు జగదీశుని లీల పృథ్విలోనుండి పృథ్వీజీవితమును (స్వీయరచిత దృశ్యకావ్యమును పురస్కరించుకొని) రంగస్థలమున నిలిపి నాటకకర్త అవలనుండి అనిమేషలోచనుడై ప్రదర్శనమును విలోకించును. సృష్టికర్తలు ఆమేయయ్యు, తమ సృష్టియందు తలదూర్చక పాత్రల కవ్వల వీరు నిలుతురు. ప్రకృతియందలి నిగూఢాంశములను కనుగొనగలుగు కన్నులు వీరికున్నవి. కావున, ఆదర్శరూపకములను సృష్టించుటందును, ప్రత్యక్షజీవిత ప్రతిరూపమును తమ తమ రంగస్థలములపై జూపుటందును వీరు సిద్ధహస్తులై వెలయుదురు.

ఒక్కొక్కయుగమున ప్రబలమైయుండు భావపరిణామ మా యుగజీవితమున నాత్మవ్యక్తీకరణము గాంచును. ఈ దృశ్యము నవలోకించి, స్వీయరచనమున రూపకకర్త దానిని చిత్రించును; ప్రకృతి కెదుట ముకురము నిలుపును; సత్యమును (ప్రియమైనదైనను, అప్రియమైనదైనను) ప్రకటించును. ఇట్లొనరింపజాలనివాడు నాటకకర్త కాక బూటకకర్తయే యగును.

భారతభూమియం దాంగ్లేయు లావిర్భవించినపిదప గాంధియుగమున మహత్తరమైన భావవిప్లవము తలసూపినది. లాతి యూహల నరికట్టినది. కుబుసము విడిచిన పామువలె భారతజాతి క్రొత్తశక్తితో విలసిల్లినది. భావదాస్యమువలన దాపురించిన అరిష్టములు ధూళ్యవలుంఠితములు కాదొరగినవి. కంటిపొరలు రాలినంతన, మానస దిశావలయమున నవ్యచైతన్యము తళుక్కొత్తినంతన, సంపూర్ణరూపమున సత్యమవగతమైనంతన, తమ్ము దాము గుర్తించుకొని, స్వీయ పునరుద్ధరణమునకై భారతీయు లాతురంపడుచున్నారు.

భూత పూర్వయుగమున భారతకృషికుడు జుగుప్సకరమైనాడు; తగని బరువును తలపైదాల్చినాడు; బ్రతుకు చవి గోల్పడి, రక్తమాంసములను అత్యాచారమునకు నంజుకొన బెట్టినాడు. సాధుజన పరిత్రాణకుతలుండైన సర్వేశుడు కృషికు నుద్ధరించుటకై కృషికుడై యవతరించెను. రైతునని నేత గాడనని గాంధీజీ భారత దిగ్వలయమున తేజరిల్లినతోడనే కర్షక జీవితమున నపూర్వపరిణామము

---

* God is immanent and transcendent.

శిరమెత్తినది. కృషిక పునరుద్ధరణమున భారతపునరుద్ధరణము నవలోకింప నాయకు లువ్విళ్ళూరుచున్నారు.

ప్రస్తుత యుగమున ప్రాముఖ్యము వహించిన ఈ యద్భుతాంశముపై కన్నునిలిపి, పూర్వోక్తరూపక రచనావిధిని హృదయంగమము గావించుకొని, శ్రీ వన్నివీను రామారావుగారు గాంధిశకభావపరిణతి నాత్మరచనమున ప్రకాశము గాంచి, " రైతుబిడ్డ " కు కన్నతండ్రియైరి.

గ్రామములకు నూరు యోజనముల మేరలో నిలిచి, గ్రామ పురోభివృద్ధిని గురించి గంభీరోపన్యాసము లొనరించువారికి వీరు దూరస్థులు. పల్లెవాసులందు పుట్టి, పల్లెయందు స్థిరసదనము నెలకొలిపి, పల్లెసమస్యలెఱిగి పల్లెవాసుల సుఖ దుఃఖములందు పాల్గొని, పల్లెజీవితము నితివృత్తము జేసికొని వీరు ప్రస్తుత రూపకమును రచించిరి. యుగసాంప్రదాయమునకు నంజలి ఘటించిన దేశ భక్తులగుడు రాజులను రాణులను గాక కృషికులను కార్మికులను పాత్రల గావించిరి. గ్రామోద్యోగుల వలననేమి, అన్యాధికారుల వలన నేమి, ఉత్తమర్ణుల వలననేమి, ఆర్థికనిరంకుశత్వమున బద్ధదీక్షితులైన యజమా నుల వలననేమి, పేదరైతు పడుపాట్లను అనల్పమైన నేరిమితో చిత్రించిరి. కర్షకకుటుంబస్థులు వెంకయ్య మంగమ్మలును, భూదేవి రాములును పవిత్రజీవు లని రూఢిచేసిరి. తన కొగ్గుగావించిన దుర్మతులను ప్రేమించి, తన్ను ప్రేమించిన బసవన్నను తన ప్రాణముకంటె మిన్నగనెంచి, దేశసేవకులందు తలమానికమై మహాత్ముడై వెంకయ్య వెలసినాడు. గ్రంథమును విశేషముగ సౌరభాన్విత మొనరించిన దీతని పాత్రయే ! బాహ్యసౌందర్యము కంటె నాంతరంగిక సౌంద ర్యమే మహత్తరమైనదని భారతసాహితి విశ్వసించు నెరిగి, గ్రామసౌందర్యమును గురించి కవిత్వము చెప్పక, గ్రామవాసి హృదయసౌందర్యమెంత యద్భుత మైనదో యీపాత్ర సృష్టియందు గ్రంథకర్తగారు వ్యక్తీకరించిరి. గాంధి యుగమును సౌందర్యసందీపిత మొనరించిన భవ్యాదాశయములను జూచి, వీని వెలుంగున కాత్మజీవితము నొడ్డి నేటి కురుక్షేత్రమున రథరజ్జువును చేబూనిన యువభారతమును నారాయణరావు భూమికయందు ప్రత్యక్షము గావించిరి. పాత్రోచితవలచు భాషను వాడి గ్రామవాఙ్మయమున నంతర్భూతమైన జాతీయ ములను, సామెతలను, కడుకౌశలమున బ్రయోగించి, జానుతెనుగులోని తియ్యందనమును పతితల సొమ్ముజేసిరి. దేశసేవకు మార్గదర్శకమగు సాహిత్య సేవను నెఱపి ధన్యులైరి.

దేశభక్తియందును, సేవానురక్తియందును అనర్ఘమైన ప్రశస్తినందిన ఆంధ్రమహాజను లీ గ్రంథమును తగురీతి నాదరింతురని ఆశపడుచున్నాను.

చెన్నపురి,
జూన్ 1, 1939

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# అభిప్రాయములు

i

పట్నవాసాల్లో మేడలమీద తూగుటుయ్యాలలపై సోఫాలపై ఆపసోపాలు పడుతూ, పల్లెటూళ్ళ కష్టార్జితాన్ని అనుభవించే పెద్దలు ఉబుసుపోకకు అప్పుడప్పుడు పల్లెల దుర్గతికి దైన్యానికి విచారపడటం ఆచారం అయిపోయింది మాటలకు మాఅమ్మేగాని పెట్టు సవతితల్లి పెట్టు అన్న సామెతగా వుంటుంది నిజానికి-యీ శిష్టుల సానుభూతి. కడుపులో లేనిది కౌగిలించుకుంటే రాదన్నారుగదా పెద్దలు పల్లెలు బాగుపడాలి పల్లెలు బాగుగడాలి అని పదేపదే పత్రికల్లోను సభావేదికల మీదను నోరుచేసుకొని లాభంలేదు. నాగరికులు భోగాలు అనుభవించాలి, పల్లెలు బాగుపడాలి అంటే కుదరదు. అందుకనే గాంధీజీ పల్లెలో కాపురముండి పల్లెప్రజల కష్టసుఖాలకు ఆదుకుంటూ వారితో కలిసి మెలిసి పోతున్నారు.

పల్లెలోపుట్టి పల్లెలో పెరిగిన యీ గ్రంథకర్త సబ్నవీసు రామారావుగారు పల్లెల దుర్గతికి వలపోసి వాటి దైన్యాన్ని కళ్ళకు కట్టేటట్లు చూపినాడు. పల్లెలో బ్రతుకు తెరువులేక మాన ప్రాణాలు దక్కించుకోడానికి ప్రజలు పల్లెలు పాడుబెట్టి పట్నాలకెక్కి అచటకూడా నానా అగచాట్లుపడుతున్నారు. ఆ యీ సందర్భాలు మనసుకెక్కి వాటినిగూర్చి నిరంతరం మననంచేస్తున్న గ్రంథకర్త, తన మనోవేదనను యీ గ్రంథరూపంగా వెలివిరియించినాడు.

కేవలం వూహచేసి యింతకంటె రసవంతంగా, మనోరంజకంగా రచన చేసే సిద్ధహస్తులగు కవులు వుంటేవుందురుగాక. పల్లెప్రజల కష్టసుఖాలు వారి నోటివెంట వారిభాషలో పలికింపగల యీ గ్రంథకర్త నేర్పుమాత్రం యితరులకు సాధ్యంకాదు. మొదలీ గ్రంథకర్తకిది సహజపాండిత్యమే గాని నేర్పుకాదు.

మన దేశీయాలను, లోకోక్తులను యింత చక్కగా గురుతెరిగి కావ్యంలో వాడిన కవులు లేరనే చెప్పవచ్చు. అపరూపమైన యీ భాషాచిత్యమే యీ గ్రంథాన్ని చిరస్థాయిచేసిపెట్టగలదు. నాగరకుల మనస్సు నీ గ్రంథం కరిగించి పల్లెలవైపు పారించగలదని నమ్ముతున్నాము.

ము. కృష్ణారావు

బందరు, 26-4-39. కా. వెంకటేశ్వరరావు

ii

కవిత్వానికన్నా, శిల్పానికన్నా జీవితమే పునాది. శిల్పి, ఉత్కృష్టమైన రచన చెయ్యాలంటే, జీవితాన్ని సమగ్రంగా, సాక్షీభూతుడై సందర్శించి,

హృదయం పేరుకుపోగా, మనస్సు పులకరించిపోగా ఆనందం అనుభవించి వుండాలి. అందులో ప్రకృతికీ శిల్పానికీ దూరంకాని, మనుష్యుని కల్పనకు దూరంకాని గ్రామజీవితం కళాస్రష్టలకు ఉద్దీపనకారణమైనవానిలో వుత్తమం.

శ్రీయుత సబ్నివీసు రామారావుగారు రచించిన గ్రామజీవితాన్ని గురించిన "రైతుబిడ్డ" నాటకం నాకు యెంతో ఆనందం కలిగించింది. కథ సరళమైంది. రోజు రోజూ మనయెదట ప్రదర్శింపబడే గ్రామవిషాదాంత నాటకమే కథావస్తువు. వెంకయ్య రైతు ధర్మహృదయం కలవాడు. పాటుపడే రైతు. అయితే మాత్రంయేమి? పాడుసంఘం, రాజకీయ స్థితి అతన్ని బలితీసుకుని గ్రామాన్నుంచి తరిమేస్తవి. నిజంగా ఇప్పటి గ్రామజీవితమే, ఇంకో పదిసంవత్సరాలు నడిస్తే పల్లెటూళ్లు స్మశానం దిబ్బలు అవటానికి యేమీ సందేహంలేదు.

కాని రామారావుగారి కవిత్వంలో ఒక ప్రత్యేకత్వంవున్నది. శ్రీ చెళ్లపిళ్ల గురురాయని వ్యావహారికం శిష్టవ్యావహారికంలో ఉచ్ఛస్థితిని పొందినశైలి. రామారావుగారిభాష గ్రామ్యవ్యావహారికంలో ఉచ్ఛస్థితిని పొందింది. జాతీయాలు కాకుస్వరము పొదిలించిన జీవభాషవారిది. శైలి నిర్దుష్టము. ఒక్కపొల్లుమాటలేదు. బరువుతూచి, రంగులుతూచి, స్వరూపమును గమనించి శిల్పచమత్కృతులు చూరలిచ్చిన మధురశైలి. ఒక్కసారిగా వినుకొండవెళ్ళిపోయాను నాటకం వింటూంటే. ఆ విషయంలో రామారావుగారి ప్రతిభ అద్భుతము.

బందరు, 26-4-39 అడివి బాపిరాజు

---

iii

I am very much impressed by the theme and style and the manner in which you have portrayed the characters.........

Bellary. T. Raghava.

---

iv

శ్రీ సబ్నివీసు రామారావుగారిచే రచింపబడిన "రైతుబిడ్డ" యను నాటకము సమగ్రముగ చదివినాను. ఈ కాలమున ఆంధ్రహృదయమున ప్రజ్వలించుచున్న నవ్యభావము లిందు చక్కగ ప్రతిఫలించినవి. ప్రకృతిని తన హృదయ దర్పణమున ప్రతిఫలించజేయువాడే కవి. ఈ యుగపు ప్రతినిధి కవులలో నీయన గౌరవస్థానము వహింపగలడు.

జాతి గ్రామములో నివసించును. గ్రామవాసుల లక్షణములనుబట్టి జాతియొక్క లక్షణముల నిర్ధారణచేయవలయును. ఇతరభాషలతోడి సంపర్కము వలన చెడని జానుతెనుగు గ్రామములోనేయున్నది. సంస్కృతకవులచే రచింప

బడిన తెలుగు కావ్యములు సంస్కృత రచనలం బోలియుండుటచేతనే, వారు ఒకటి రెండు జాతీయములసేరి తమ గ్రంథములలో సంస్కృత సమానములమధ్య నిరికించుకొని "యీ గ్రంథమునందచ్చటచ్చట జాతీయములు కలవను" పేరును సంపాదింప చూచుచుండిరి. రామారావుగారి క్లేశపడినదో గాని 'రైతుబిడ్డ' ఆమూలాగ్రము జాతీయమే. ఇట్టి కవికుమారులవలన తెలుగు తల్లి పునరుద్ధరింపబడగలదు.

నాటకమున రసములు చిప్పిలుచున్నవి. పాత్రపోషణమెంతయు బాగున్నది. ఉన్నదున్నట్లు సినిమాలలో కెత్తదగియున్నది. తెలుగు లోకము ముద్రగంథముపై వలపుగొందురుగాక!

గుంటూరు, 21-4-39. ఉన్నవ లక్ష్మీనారాయణ

---

V

శ్రీ సన్నిధానం రామారావుగారు రచించిన "రైతుబిడ్డ" అనే నాటకం ఆమూలాగ్రంగా విన్నాను. ఎంతో సంతోషమయింది.

వెంకయ్య అనే రైతునూ అతనికుటుంబాన్నీ నిమిత్తమాత్రంగా పెట్టుకొని గ్రంథకర్తగారు, ఈ నాటిరైతుల కష్టనిష్ఠూరాలను కళ్లకుకట్టినట్లు వర్ణించారు. లలితకళకూ, నిత్యజీవనమునకూ సంబంధమిందు అందముగా కూర్చితీర్చబడ్డది

గోపూజా పశుపూజలలో ఉన్న రహస్యం నిజరూపకంగా యీ నాటకంలో దొరకుతుంది.

అన్నిటికన్న గొప్పవిషయం ఈనాటకంలో వాడబడినభాష; ఎంతకాలమో పరిశ్రమచేస్తేనేతప్ప అట్టిజాతీయభాష అలవరుచుకొని గ్రంథంలో ఎక్కించడం కష్టం

వృత్తికి సంబంధించిన పదాలు. మాండలీకములూ యీ నాటకములో కలవు అందరికి తెలియగలందులకు వాటి అర్థాలు వివరిస్తే బాగుంటుంది.

ఈ కాలానికి అనుగుణంగా వున్నదీ గ్రంథం ఇట్టి నాటకాలు పల్లెలలోనూ పట్టణములలోనూ ప్రదర్శించడంవల్ల గ్రామపునరుద్ధరణ కార్యమున్నూ ప్రజాప్రబోధమున్నూ కలుగగలవు తెలుగు పల్లెటూరి జీవనాన్ని యింత హృద్యంగా వ్రాసిన గ్రంథకర్తగారు ధన్యులు.

మార్కాపురం, 7-2-39. చింతా దీక్షితులు

---

vi

సంఘములోని చెడుగులు పరికటించి, వాటిని తొలగించడమునకు టాల్‌స్టాయి మొదలైన మహనీయులు అవలంబించిన మార్గము శ్రీ రామారావు పంతులుగారు చక్కగా అలవర్చుకొని, ఈ నాటకము రచించి కృతకృత్యులయినా రను కుంటాను. వస్తువు, రచన, భాష, అన్నీ పొందికగా ఉన్నవి. మన పూర్వుల

కాలమందు యక్షగానాలు, భాగోతాలు, తోలుబొమ్మలాటలు, మాత్రమే ఉండేవి. వాటిలో హాస్యగాడు అప్పుడప్పుడు సంఘములోని చెడుగులు సూచించేవాడు. కవులు శతకాలలో ఉగ్గడించేవారు.

మన కాలమందు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, కల్లూరి వెంకటరామశాస్త్రిగారు, గురజాడ వెంకట అప్పారావు పంతులుగారు, వాడుక భాషలో నాటకాలు, ప్రహసనాలు, రచించినారు. పాత్రోచితమైన భాష, కల్పితమైనది కాక వాస్తవమైనది, ప్రయోగించి చక్కగా సంభాషణలు రచించినవారిలో రామారావుగారు అగ్రగణ్యులవుతా రనుకుంటాను.

పాశ్చాత్యులలో నాటకాలు రచించేవారు పామరుల భాష తెన్నుగా నేర్చుకొని మరీ ప్రయోగిస్తున్నారట ఇట్టి భాషను ఒక విమర్శకుడు "A joyful living speech radient with colour, aglow with feeling and rooted in nature" అని వర్ణించినాడు.

ఇట్టి గ్రంథములు అనేకములుగా వీరు రచించవలెను. సంఘజీవనము వివిధముగా ఉన్నది. చెడుగులూ లోపాలూ అనేకముగా ఉన్నవి ఇవి తొలిగించడానికి ఇప్పుడు ప్రబంధాలూ, శతకాలూ, వ్యాసాలూ, పనికిరావు. నవలలు ఉపకరిస్తవి కాని అవి ఓపికతో చదివేవారులేరు యూరోపులోను అమెరికాలోను కూడా నాటకాలవల్లనే ప్రజల భావాలు అన్నివిషయములలోను పరివర్తన పొందుతూ ఉన్నవి నాటకరచనలో కూడా ఈ కాలమునకు అనుకూలమైన మార్పులు కలుగుతున్నవి. పూర్వులు చెప్పిన లక్షణాలు ఎవరూ పాటించరు. వీరు స్వతంత్రులు. పండితుల కోసము వీరు గ్రంథాలు రచించడములేదు పామరులకోసము. పామరులకు వినోదకరమైన ... పాటు పండితులు కూడా మెచ్చుకొంటారు, వివేకులయితే చూడండి!

రాజమహేంద్రవరం, 26-5-39 గీ॥ వెం॥ రామమూర్తి

---

vii

అనేక ఆశీర్వచనములు:-

మీరు పంపిన "రైతుబిడ్డ" చేరినది. నాకుటుంబము నంతటిని దగ్గర కూర్చోబెట్టుకొని చదివినాను.

మీకు వ్యావహారిక భాషా రచనతత్త్వము బాగుగాబోధపడినది. కథ చాలా రసవంతముగా నడిచింది. మీ భావములు నిర్మలములు, కాబట్టి వాక్కు కూడా వాటి ననుసరించినది.

ఇంకా 'రైతుబిడ్డ' వంటి ఉన్నతాశయ బోధకములైన రచనలకు మీ లేఖిని నుపయోగింతురుగాక అని కోరుతున్నాను.

అనంతపురము, 27-5-1939. చిలుకూరి నారాయణరావు.

---

viii

*My Dear Sir,*

Many thanks for your letter of the 13th instant.

I went through your interesting drama. There is much sincerity of feeling and the language is appropriate and powerful. The opening scenes are effective and the drama has a certain amount of unity until the return of Venkayya and his family to the village.

From the point of view of dramatic art, it is in my opinion a bit spoiled by too much of what may be called propaganda, and the scenes subsequent to the return of the chief character and his family to the village have no organic unity with the plot and are merely tacked on mechanically. They are like links in a chain and not as organs of a single body. In fact, in this way there is nothing to prevent you from tacking on other scenes on the remaining portions of the Gandhian Gospel or on any new principles and policies he may lay down.

But, of course, this makes the drama more popular. But I do not think it can give it artistic unity.

I am glad to note that your characters are well-drawn and are naturally true to life though a few strike me as abstract embodiments of propagandist ideas rather than live complex individuals.

As regards your language, dialectical Telugu, no doubt, adds to the naturalness and life of the drama but it too is not without its shadows. For instance, some sentences are hardly intelligible to people outside your geographical range. Secondly, dialect undergoes more changes than standardised language. And it will not have the same permenance as classical Telugu. The universality and eternal vogue of Mahabharata is due to the fact that its language is as intelligible to-day as it was

then. Do you think that if our great epics and dramas had been written in local dialects instead of standardised Sanskrit and standardised Pali, they would have an appeal spread over centuries and still remaining fresh and young? However, on this point, every artist must be his own judge.

It is because you have, I think, talent and sincerity of thought and feeling, without which no effective writing is possible, I have ventured to write at some length. This drama is sure to be popular at the present time.

There is no obligation on you to publish this opinion of mine. My only desire is that you should try to produce better works in the future and add to the richness of our language.

Yours sincerely,

**C. R. Reddy.**

*Waltair, 17th June 1939.* *Vice - Chancellor.*

*P. S:* Our people do not appreciate the difference between historical changes in a language and local dialects. For instance, English has undergone big changes from Early Saxon to Chaucer, Chaucer to Shakespeare, and Shakespeare to the present time. But it is the slow and general development of a language, and every phase of it can have literary value more or less permenent, if not equally general at all times. But to say, therefore, that poems should be written in the dialect of Yorkshire or Scotland or Wessex or Wales or Cockney, etc. is to commit fallacy. Of course, poems could be written in any language since life is feeling and imagination and not grammar and vocabulary. But then dialectical poems cannot have a wide range of effective publicity nor will they have a long life.—

# మనవి

మా "రైతుబిడ్డ" పుట్టి చాలాకాలమైనది. అయితే అతనిపేరు ప్రఖ్యాతిలోకి రాలేదు. సంఘం కుంగతీసింది. రాజకీయాలు రాపాడినవి. అతన్ని గుర్తించి చేయూతనివ్వగల రసజ్ఞులే—అతనిని ఉబ్బించి, పూరించి, అతని యితివృత్తాన్ని బాగా అవగాహనచేసుకొని, అమాయికుడన్న సంగతి మనసార తెలుసుకొని, అతనిలోవున్న సత్తానంతా సొంతంగా వుపయోగించుకుంటున్నారు. నిరభిమానదేశము; నిస్సహాయలోకము. నిజంగా అతనిలో ధర్మతేజమేవుంటే ఆంధ్రుల హృదయాకాశంమీద యేనాటికైనా ప్రకాశించకపోదు.

మా "రైతుబిడ్డ" జాతికి పునాది అయిన పల్లెటూళ్ళో నివసించేవాడు. తత్రాపి తెనుగుదేశంలో పోతుగడ్డ అని పేరుపొందిన 'పల్నాడు, వినుకొండ' సీమలకు చెందినవాడు అతనికి నడుమంత్రపు నాగరిక భాష రాదు. అతనిది యథార్థమైన తెలుగుభాష. పండిత ప్రకాండులు యెవరైనా అతని వృత్తికి సంబంధించిన మాటలు అర్థంకాలేదని, భాష యెబ్బెట్టుగా వున్నదని- మూతులు ముడువవచ్చు; కండ్లెర్రచెయ్యవచ్చు. అంతమాత్రంచేత అతను తన జాతీయతను విడువలేదు. మాతృగర్భంలోనుంచి వచ్చేటప్పుడు స్తన్యంతోపాటు తెచ్చుకున్న భాషను, భావాలను, ఔచితిని అతను మరువలేదు.

మా రైతుబిడ్డ పదగుంభనలతో గూడిన పద్యాలు, పార్శీమట్లు పాడలేదు. నేర్చుకోవలెనన్న తలంపూలేదు. బలవంతంగా యెవరైనా చెప్పిచదివిస్తే వాటిల్లో ఉన్న రసాన్ని నీరసం చేస్తాడు. అయితే బొత్తిగా సంగీతజ్ఞానం లేనివాడు మాత్రంకాదు. అతనుచేసుకునే పరిశ్రమకు తగినట్టు సమయానుకూలంగా పాడుకోటానికి నాలుగు పాతపాటలు- పల్లెటూరిపాటలు, నేర్చుకున్నాడు. పొట్టనిండని కూటికైచేసే శ్రమను మరచిపోవటానికి అతనికా పాటలు చాలవూ?

నాటకములలో ఉపన్యాసములు, ప్రచారములు పనికిరావని తెలిసికూడా అనివార్యమవటంచేత అయిదవ అంకంలో కొంత ప్రోపగాండా చొప్పించవలసివచ్చింది.

మా రైతుబిడ్డలో అనేక లోపాలుండవచ్చును; గాని తెలిసిమాత్రం అతను యేలోపం చెయ్యలేదు. తెలియక చేసిన లోపాలను న్యాయమైనబుద్ధితో సకారణంగా యెవరైనా తెలిపితే తన పంథాను మార్చుకునే యోగ్యత గూడా వుంది మా రైతుబిడ్డకు.

పతాకగీతాన్ని భరతమాతృస్తవాన్ని మా తండ్రిగారి "గేయగుచ్ఛము" లో నుంచి తీసుకున్నాను.

తొలిపలుకును, అభిప్రాయములను వ్రాసి పంపిన మహాపురుషులకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు. వారి అభినందనములను ఆశీర్వచనములుగ భావించి, వారి వాక్యరాజములు నాకు వినయమును కలిగించగలందులకు ఈశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఈ నాటకాన్ని సొంతం తమ పత్రికలో వరుసగా ప్రతివారం ప్రచురించటమే కాకుండా పుస్తకరూపంగా కూడా ఉచితంగా అచ్చువేయించి నన్నాదరించిన శ్రీ కృష్ణాపత్రికాధిపతులకు నా హృదయపూర్వక నమస్కారములు.

మొదటినుంచి నన్ను పుత్రవాత్సల్యంతో చూస్తూ, నా శ్రేయోభివృద్ధికై ఆతురపడుతూ యీ నాటక రచనకు నన్ను నిరంతరం ప్రోత్సహించి, అర్థికముగ తోడ్పడిన భాషాభిమానులు మ. రా. శ్రీ. శింగరాజు మల్లపరాజారావు బి. ఏ. యల్. టి. గారికి నా ధన్యవాదములు.

ముఖపత్రంమీది "రైతుబిడ్డ" చిత్రాన్ని వ్రాసియిచ్చిన నా ప్రియమిత్రులు, సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీయుతులు పొట్లూరి హనుమంతరావుగారికి నా నమస్సులు.

పెరుమాళ్లపల్లి, వినుకొండపోష్టు
20-6-1939.

సబ్నివీసు రామారావు.
గ్రంథకర్త.



# రైతుబిడ్డ

## ఒకటవ అంకము

### రంగము—౧

ప్రదేశము: పల్లెటూళ్లో పంటకళ్లముప్రక్క, బాట.

ప్రవేశము: వెంకయ్య, బాలయ్య, రోశయ్య.

(వెంకయ్య:- కుప్పడపంచు ముతక పంచె కట్టుకొని, మోకాళ్లపైకి గుమ్మడిపండుగా, దోపుకొని, యుంటాడు. బుజంమీద లక్కాకంచు ముతక కండువా వేసుకొని, ముతక తలగుడ్డ ధరించి వుంటాడు కుడిచేతికి బంగారపు దండకడియం; మొలకు వెండి బిళ్లల మొలత్రాడు; ఎడమ చెవికి జంపు వ్రేలాడుతూ వుంటుంది. చేతిలో ములకాలకర్ర వుంటుంది. కోరమీసం. మొహాన నిలువుగా కుంకుమతో పుల్లబొట్టు పెట్టుకొనివుంటాడు. యేబది సంవత్సరముల వయస్సు. యారాశిమనిషి; చామనచాయ. బాలయ్య, రోశయ్యలు నల్లనివారు; ముతకగుడ్డలు ధరించివుంటారు.)

వెంక:— అరేయ్, బాలయ్యా! బంతులకు సరిపొయ్యేట్టు, గొడ్లు చిక్కినయంట్రా?

బాల:— ఫ్రౌ! యెల్లికొల్లలుగా చిక్కినయే!

వెంక:— మా పుల్లెద్దును మేటేసి, గుల్లెద్దును అరిమేటేసి, దానెంబడి కర్రెద్దు నేసి, యిసుర్న జిర్రెద్దు నెయ్యకపోతె తిరగవు.

బాల:— అట్టాగే యేశాము గాని— సుబ్బయ్యగారివి మూడెద్దులేనే! నాలుగోది యేదెయ్యాలెనో?

రోశ:— అల్లా మంగయ్యగారి చుక్కదున్నను యేశాము లేక్పోయ్— నాలుగూ పనపడి గసగస తిరుగుతయి. (లోపలి

చూచి) వూరి బెమ్మాయోవ్ ! పలకడేంది ? వూ అరేయ్ ! మా కోడెను దున్నలజత నెయ్యబాకరోయ్. అడ్డంతిరిగి పైకెక్కుతుంది. అల్లా మాదయ్యగారి ముసిలెద్దుల జతనేస్తె చుక్కాలె తిరుగుతుంది.

(లోపల : ఓవ్ ! ఓవ్ ! నిలపడు. కదల్తివా అంటె యీపు బద్దలుగా పగలాలె. కాశయ్యా ! చెవుపట్టుకొని తీసుకురా ! యేమందులే ! ! )

రోశ :— వాడిచేతగాదురా ! దానికొమ్ములు రాంబాణా లాలె వున్నయి. బయపడుతున్నాడు.

బాల —(నిక్కిచూచి) ఆ బంతికాడికి పో రోశయ్యా. చదర పీక్కొని గడ్డిమీద పడాలని చూస్తున్నయి. తోకమడి కాడ గీరుపో ?

రోశ :— (లోపలకేసి చూస్తూ) అట్లా కొట్టుకుంటా డేం దుకు ? కొట్టబాకరా !

(నిష్క్రమించును.)

వెంక :— (నిక్కిచూచి) కాసెయ్యగారి బట్టెద్దును యెంత దెబ్బ కొట్టేడో చూడు. ఆ దెబ్బ ఆయువపట్టున తగులుతే యేమయ్యేది ? నాకెందుకో యెడమక న్నదురుతున్నది...

బాల:— పంటకళ్లాల అదున్న వున్ని సెట్టి, నీబాకీకి జప్తు తెస్తాడని వూళ్ళో పుకారుగా వుందిలె ! ! కన్నదురుతున్న దంటు న్నావు. అది నిజమాతుందేమో !

వెంక :— యేమో అన్నట్టు ! ! తెచ్చేవాడు పనిపాటల వాండ్లకు మేరసారెలు పెట్టేంతరువాత తెచ్చినా బాగుండును. పాపం కడుపులో కాలినవాండ్లు. ఆవులావులు పోట్లాడుకొని, లేగల కాళ్ళిరగతొక్కినట్టు నడుంగా వాండ్లగతి అన్నేయ మవు తుందేమో అని, నాకు దిగులు.

బాల:- కర్ణం కాంతయ్య వూళ్లోనే వున్నాడులేవే ! ఆయన కదలకపోతే, కద నడిపే దెక్కెవురు ? శివునాగ్గె లేందే చీమ

కుడుతుందంటగాని—వడసారం పొద్దుకూకొచ్చింది. యీవర కల్లా తొలువాలుగడ్డి తీస్తే కళ్ళం పెందలకాడ అయ్యేది. యెట్లాగో కలిమట్టు పట్టేప్పటికి గొరకొయ్యలు కూకుతై. [లోపలికిచూచి) అరే పోలుగా! కళ్ళంచుట్టూ పొలితిరిగేవంటా]?

(లోపల) "తిరిగిన్ను దొరా! బంతుల్ని తోల్తావుండం"

బాల:- పదం పాడే యెంకయ్యమామా! ప్రొలిపదమూ!!

వెంక:- కుర్రోళ్ళు మీరు పాడకూడదు?

బాల:- అనుమంతుడిముందర కుప్పిగంతులంటే? మామొగాలు మేమేం పాడుతాము నీముందర?

వెంక:- సరె అందరూ బంతుల అదిలించండి పాడతాను.

బాల:- (నిష్క్రమింతురు)

వెంక:- పొలోలిగా!

(లోపలఅందరూ) పొలోలిగా!

## వోలిపదం

వెంక:— "వొలియ వొలియో....వొలియా
కోటేలు కలవాడా- రారా పొలిగాడా"

(లోపల అందరూ అదేపాడతారు)

(ప్రతిచరణం వెంకయ్య ప్రొలియప్రొలియో...అని అంటూ పదంపాడాలి, దాన్ని లోపల అందరూ అనుసరించాలి.)

వెంక:— "వొలియ వొలియో.... వొలియా
కోటేలూ మీవయ్యా- కోంఢ్రా మాదయ్యా
లక్షలూ కలవాడా- రారా పొలిగాడా
లక్షలూ మీవయ్యా- రాశీ మాదయ్యా
వెయ్యేలూ కలవాడా- రారా పొలిగాడా
వెయ్యేలూ మీవయ్యా- యెన్నూ మాదయ్యా
నూరేలూ కలవాడా- రారా పొలిగాడా
నూరేలూ మీవయ్యా- నూగు మాదయ్యా

పదివేలూ కలవాడా- రారా పోలిగాడా
పదివేలూ యీవయ్యా- పంటా మాదయ్యా
యెద్దూలూ తొక్కంగా- యెదిగేనే రాశీ
కోడేలూ తొక్కంగా- కొల్లాయె రాశీ
పెయ్యాలూ తొక్కంగ- పెరిగేనే రాశీ
దున్నాలూ తొక్కంగ- దిన్నేలా పొడుగు
పోలిగాడూ కొట్టంగ- పోగాయె రాశీ
వచ్చేనే పోలిగాడూ- వాయూవేంగాన
దాగేనే పోలిగాడూ- దండాకట్టుల్లో"

వెంక:- పోలోలిగా !

లోపల :- పోలో లిగా !

వెంక:- గడ్డి దుగుడుగ్గుగా మెదిగింది. బంతుల్ని బయటికి తోలండి. ఇంకా వుంచితే గడ్డి పొడుంపొడుమవుతుంది. యిద్దరు, యెన్నుదంతెలతో గడ్డిగుంజుతూ నలుగురు చేవాట్లుపట్టండి. తక్కినోండ్లు పనలు పట్టుకొని వామికాడికి వదండి. గొడ్లు పెనగపడకుండా ఒకరు బంతులకాడ కాపలావుండండి. నేను వామి తీరుస్తాను. (నడుముకు పైగుడ్డ బిగించుకొని నిష్క్రమించును.)

## రంగము— ౨

ప్రదేశము :- వెంకయ్య యిల్లు

ప్రవేశము :- మంగమ్మ

(నీరుకావి మైజారుకోక; అద్దాల రవిక; బళ్లారి గాజులు; కండ్లకు కాటుక; మొగాన కానీవెడల్పు కుంకుమబొట్టు; కొప్పులో బంతిపూలు; మెడలో పొగడాల తావళం; నల్లపూసల దండ; పలకసరి వట్టెడ; పమిడి నల్లపూసలు; ముక్కుకు నత్తు; చెవులకు వల్లేరుపూలు; దండకడియం; రెండువేళ్లకు మిద్దె వుంగరాలు; ధరించి కట్లపీటమీద కూచ్చొని రేకులాడుకుతూవుంటుంది. కుడి ప్రక్కన రేకులబుట్టలో రేకు ఉంటవి.)

పాట

౧

మంగ:— వడుకుదమా — వడుకుదమా
వడుకుదమా — యేకు లొడుకుదమా!
ఆటంకం.... లేకుండా
రాటంబు తిరుగుతుంటె — కాటక మెక్కడి దంటూ॥వ॥

౨

తీయుదమా — తీయుదమా
తీయుదమా — నూలు తీయుదమా!
ఎక్కువ వో.... పికచేసి
ముక్కుల్లో గాలీకి — దక్కన్ని నూలూను ॥వ॥

౩

పండింతమా — పండింతమా
పండింతమా - పత్తి పండింతమా!
కాడి వే.... దిని నమ్మి
కర్పూ మప్పై పుతుంటె - కాటక మెక్కడి దంటూ ॥వ॥

౪

పొందుదమా - పొందుదమా
పొందుదమా - స్వేచ్ఛ పొందుదమా!
సేద్యంబు.... రాటంబు
సొంతమున కింతకంటె - వుంతే లేదని చాటి॥ వ॥

(వెంకయ్య గోగునార చీలుస్తూ ప్రవేశిస్తాడు)

వెంక :- ఇదుగో! పనిపాటలవాండ్లకు గింజ లిచ్చావా?

మంగ :- ఇచ్చేసినా! కడుపులో కాలినోండ్లయిపోయెను. నీ వటు పోంగానే వొచ్చి కూచ్చుండిరి.

వెంక :- ఇయ్యమనేగా చెప్పింది. యెవరి కెన్నిచ్చినావో నని అడుగుతున్నా.

మంగ:- యేటా యిచ్చినట్టే యిచ్చా. కుమ్మరోడు చల్ల కుండ లేమిటి, పచ్చటిబాన లేమిటి, కూరచట్లేమిటి యింటికి పట్టిన కుండలన్నీ యిస్తున్నా నమ్మా అని గునుస్తుంటేను, ఒక తూమెడు గింజలు కొలిచాను. అసింగ మనుకోకుండా చాకిరి చేసేవాడినమ్మా అంటేను మంగలి కొక తూమెడు, చాకలి కొక బస్తా కొలిచాను.

వెంక:- చాకలికి శానా కొలిచావే! ఈయేడు కంకులు గూడా వల్లమాలిన మూట కట్టుకపోయినాడు.

మంగ:- పోనీలే! వాడి కష్టం మీకేం తెలుస్తుంది. కన్న తల్లి రుణం, గుడ్డలుతికే చాకలిరుణం యెంతయిచ్చినా తీరేదా?... ఇంకా దేవుడు మేలుచేస్తే...... మాలోడు వుండలే—వాడేమో యింటిలుపాదికి చాపుల్నేస్తిని; వేటికిగూడా సరిగింజలైనా ముట్ట లేదమ్మా అని దేబిరిస్తేను వాడి కొక అంకెం కొలిచాను. వడ్ల కమ్మర్లకు నిన్న నీవే యిస్తివి!

వెంక:- మరి మాదిగోడి మాటో?

మంగ:- పిలవనంపితే రాకనేపాయగా!

వెంక:- (ప్రక్కకు చూచి) అదుగో! వొస్తా నేవున్నాడు; నూరేండ్లాయుస్సు. అయితే వాండ్ల కేగాదెలో గింజలు కొలిచావు?

మంగ:- పొయిలింట్లో మెట్టుమీది వుక్కడాల బస్తాల్లోవి.

వెంక:- ఆసి నీ పిచ్చి పాడుగానూ! అవి మట్టిగింజలుకదే! పాపం వాండ్ల మొగాన పోశావు. బలేపని చేశావే!

మంగ:- మట్టిగింజ లేంది? కళ్లంలో గింజలరాశి అట్టెడ పోయించలే?

వెంక:- అట్టెడకు పెద్దలుపోయినవిగాని, కోడుమట్టి యెక్కడ పోయింది? పంటలు బాగా పండి కలిసిరావాలెకాని, యిట్టాం టివి పట్టుకుంటే బాగ్గెమంతుల మవుతామా? వాండ్ల కా మట్టి

వార కలిసివచ్చేటట్టు, మళ్లీ పిలిచి ముట్టచెప్పు.

మంగ :- నే నేమన్నా బిజనితనాని కిచ్చినాననుకున్నావా? యెన్నిచ్చినా మనగింజలు కొల్తకొస్తయి గాని-వాండ్లకష్టం కొలవ టానికి యెవరి కలివౌతుంది! యిప్పుడే పిలిపించు వాండ్లను; నీయెదనే యిస్తాను. నాకా, వురామరా తెలీదు.

(ప్రవేశం—మాదిగ పోలు)

(పిర్రిలపైకి పంచె; పేలికలు వేలాడుతూవున్న తలగుడ్డ; బుజాన దుప్పటి; చేతులో చెప్పతకలు)

వెంక :- పోలా! మేరగింజలు తీసుకపోలేమటే యెందుకు?

పోలు :- తీసుకపోదమనే వచ్చిన్ను దొరా!

మంగ :- బాకీవున్నది కామాలె దానికింద చెల్లుపెట్టరాదూ?

పోలు :- యీయేడెందుకులే అమ్మా! ముందుకు సూద్దములే!

వెంక :- ముందుమటుకు ఈ యేడంటిది కాదూ?

పోలు :- యీయేడు బగు లావు తెబ్బ తగిలుండం దొరగారూ! కూటికి మాడిపోతుండం, నేదరిపిల్లలు మేము. కల్లాల్లో వొచ్చిన తాలూ తబుకు మొన్నటి దాకా జరుపుకుండం.

మంగ :- తాలుగింజ లెట్టరా తినేది?

పోలు :- యేముండదమ్మా! వుడకపెడతం; ఆడికై ముక్కులు సిట్లి వుపుకుత్తై; అరపెట్టి దంపుతం; వూకాలె, బియ్యమైతై. వాటిని కాసుక తాగుతం.

మంగ :- మన బువ్వాలె వుంటుంది, తింటుంటె?

పోలు :- మా వుర్త్రైంబడి సేత్తంగాని, యేమిటి కుంటదమ్మా!

వెంక :- వృత్తి— వల్లకాదూ! కాలే కడుపుకు, మండే గంజి. వాండ్ల బతుకులు అంతలో చేర్నై. చూశావా? పేదతనంలో యెన్నిరకాలో!!

మంగ :- అరే! పోలూ! నాకు తెలీకడుగుతాను-- కరు వొచ్చినప్పుడు మీ యిండ్లల్లో యెవరికి బువ్వ లేకపోయినా అందరూ పస్తుంటారంట నిజమేనా ?

పోలు :- యెందుకుంటరమ్మా ? వున్నోళ్లు లేనోళ్ల కిత్తారు.

మంగ :- అప్పుగానా ?

పోలు :- అప్పయితే కట్టుబాటేముండది దొరసానీ ?

మంగ :- ఎంతమంచి కట్టుబాటు! మాకు లేకపోయె నే అట్టాంటి నీతి !

వెంక :- ఇంకా మనం నయ్యంకదూ ! పొలంలో అయినా సరే బువ్వతాగుతుంటె యెదటున్నవాడికి చారెడు పొయ్యకుండా తాగం. బాపింబల్లో యెవరిచావు వారిదేకదూ !!

పోలు :- వారు పుటకల కెక్కువ--బుద్దులకు తక్కువా లుంటయ్యా !

వెంక :- తప్పు; అదేంమాట ? నీతికలవాండ్లు అందర్లో వున్నారు-- అందర్లో లేరు. అదెంతా యిప్పుడెందుగ్గాని :-బహు లావు దెబ్బ తగిలిందంటివే, యేందది ?

పోలు :- మన కర్నమాయెన చేసిన పనెయ్యా! యీ యేటి కల్లా కోలుకునే దెబ్బకాదు. ముప్పయి రూపాయిలు ముసనట్టం చేసిండు కదూ !

వెంక :- వాగొడ్డు పోరంబోక మీకు పట్టా కిప్పిచ్చాడను కున్నారే ?

పోలు :- పాడైంది. దానికొచ్చిన తిప్పలే ఇయ్యి, ఆ వొంక పెట్టి కర్నమాయిన దుంప తెంపిండు కదూ-కూట్లో రాయి తీసుకో లేని వొండ్లని. వొకరికి తెలీకుండా వొకర్ని పాట్లో పెద్దల్ని, పది మందిని పిల్సి, వాగొడ్డు పోరంబోక పట్టాకిప్పిత్తె నాకేమిత్త రన్న డయ్యా! వొచ్చినోడి కాడ వొచ్చినట్టు, జుట్టుకు ముప్పయి రూపాయిలు గుంజుకుండడు.

వెంక :- అయితే, మూడువందలదాకా ముట్టిన యన్నమాటే.

పోలు :- దమ్మిడీ బీరుపోకుండా దులుపుకుండడు. యెవ్వడికి వాడితో నీపేరే లెక్కల్లో సేరుత్తుండాను దున్నుకోమన్నడు. అర కలు కట్టుకోని వెక్కొక్కరం ఆడికి పోయినం. తకరాలు పడ్డం. కలక తెలుపుకుండం. అందరం వుమ్మడిగా చేసుకుందమని సక్కపడి, కలిసి దున్నుకున్నం. యిప్పు డేమంటుండడు? అది సాగు సేత్తే, గూబ లొడేత్తమని పైయోరు కాయితా లంపింద్రు, పైరేత్తే పీకత్త నంటుండడమ్మా!

మంగ :- అట్లయితే మీ పైకం, మళ్ళీ యెవళ్లదివాళ్లకు యివ్వకపోయినాడా?

పోలు :- తిన్నది యాడ కక్కుతడమ్మా! ఏడదీ సాల దా యెనకు - పానకాలా రియుడు.

మంగ :- అయితే వూరుకున్నారా పాపం?

పోలు :- కళ్ళు నలుసుకుంబా! యేననటానికి ఆ యెమ్మణ్ణి సూత్తే గంపెడు బయమైపాయె కర్నాన్ని కాళ్లోకి పోయినా నమ్మరాదమ్మా.

మంగ :- పైకి అనలేకపోయినా చాటునైనా తిట్టుకుంటా రేమోనని అనుకోడు కామాలె.

పోలు :- అయ్యో! పిచ్చితల్లి! "కర్నమామెనకు తిట్టు కోసం సాకలామెనకు ముట్టుదోసం లే"దని నీకు తెలీదూ?

వెంక :- ఇంత దుర్మార్గం బలిసింది ప్రపంచకంలో, అయితే వాండ్లవే రోజులు.

పోలు :- అందుకే దొరా! యీయేడు బాకీ యీలేనం టుండది.

వెంక :- పోనీలే కొసకు యెట్టవుంతుదో! గింజ లిస్తుంది తీసుకపో.

పోలు:- యీాయేడు నలిగుండనయ్యా! మామూలు మే రిచ్చి, అదనం వక అంకెంగింజలు, కొలవమని అమ్మకు సెప్పు.

మంగ:- యెంత బాగ అనుగుతున్నాడో చూడు పాపం-- మొగోండ్ల చెప్పులు తొడుక్కొని, తొడుగులాలె యీాడవలేక భూదేవి నేను, యిబ్బంది పడటం చూస్తూనే! కొత్త చెప్పులమాట తలపెట్టకనేపోతివి?

పోలు:- అమ్మోయ్! కోపం సెయ్యబాక, తొగురూ తగరం తెచ్చి సిద్దంగుంచినా. ఇంకనాలురోజులు కళ్లుమూసుకుంటే కళ్లాలు గడుసులు సద్దుమణుగుతాయి సేసిత్తా.

వెంక:- నాకు మాత్రిం యిచ్చావటాని కొత్తచెప్పులు? యెందాకని పొదపెట్టుకునేది యీా పాత అతకలు?

పోలు:- అబ్బయ్య జోడుతో కుట్టిత్తనయ్యా అంటే కిరుని కావాలంటివి! గొబ్బెరసిప్పలు, నిమ్మకాయలు, తెచ్చి నీసెప్పులు బగు నిగాపెట్టి సెయ్యాలనుకున్నను దొరా! మెసులుపాటు సూచుకోని యీా తేప జోడుసేత్తే యట్టావుండా లనుకున్నవ్! కోడిపుంజు యెగిరి పొడిసేతట్టు వుండదంటయ్యా? హే! సూద్దువులే నా పనితనం.

మంగ:- ఆనెక్కెట్టాచేసినా ముందు అరిచేతులో వైకుంఠం చూపిస్తాడు.

వెంక:- అయితే వాడు పనివాడు కాదనేనా నీవనుకున్నది?

మంగ:- అందరూ పనివాండ్లే!

వెంక:- అబద్ధమేముంది? పనితనం చూచి సంతోషించే దిక్కు లేకుండాపోతున్నది. కాని వకప్పుడు పనివాండ్లకు తరుగున్నదా మనదేశంలో?... ఈ మాటల కేమి గాని —వాడికి —గింజలు కొలిచిపంపు.

మంగ:- పైగా యిచ్చే గింజ లిప్పుడెందుకులే. వక్క కల గనంగనే తెల్లవారిందీ? మరీ జరగనప్పుడు ఇవ్వవచ్చునులే!

వెంక :- నిజమేరా! ఆమనికాలంలోనే అంతాదూసుకలింటే ముందు చేటలు గాలికి పొయ్యేరోజుల్లో యెట్టా? యిప్పుడు కూలీ నాలీతో జరుపుకుంటుండు.

పోలు :-అట్టాగేలే అయ్యా! నీయింటోవుంటే నా యింటో వుండట్టే! అమ్మా మేరగింజ లిత్తువురా!

(మంగమ్మ, పోలు, నిష్క్రమింతురు)

(బాలయ్య మరిముగ్గురు రైతులు ప్రవేశిస్తారు)

వెంక:— ఏందో పనిగలిగొచ్చారే, అందరూ వక్కసారే?

1 వ:- మన బాలయ్యసంగతికేనే! కొట్టుకుండిరి; చారిజీకి పోతిరి. తిరగలేక యిసుకుపుట్టింది. యేదో రాజీ కూలపెట్టిస్తాం; పెద్దోడు యెంకయ్య మామఉండాడు; ఆడికి పోదాం రమ్మని పిలుచుకొచ్చామే. ముద్దాయియీకూడా వస్తానన్నాడు.

వెంక :- (చిరునవ్వుతో) కర్ణంకాంతయ్యకాడికి పొమ్మనలేక పోయినారా? ఏఁరా బాలయ్యా?

బాల:— యింకా సిగ్గులేక పోతానంటే? గడ్డితిన్నా; మూతి కడుక్కున్నా.

వెంక :- చెట్టు చెడేకాలానికి కుక్కమూతిపిందె లన్నట్టు కాలానికొద్దీ దుడిక్కుమంటే దావాలకు యేజ్జాలకు మనం పరుగెత్తు తున్నాం గాని, మనపెద్దలు రచ్చబండదాటి యెరుగుదురు? వుంగరాలచేతుల్తో మొట్టించుకుంటేగాని మనసు కుదరని మాట కాకపోతే— తగాదాపుట్టుపూర్వోత్తరాలు వూళ్లోవాళ్లకంటె యెక్కువ, వాళ్లేయెరుగుదురని పొలిమేర దాటిపోవటం? ఎటు తిరిగి చిలుమొదిలితే గాని చీద్రం వొదలదు.

2 వ:— డబ్బుదగలెయ్యాలెనని యెవరికైనా మనసంటే? మనం వూరుకున్నా పైయేటుపీనుగలు వూరుకోనియ్యారుగా!! వుర్లు మర్లు పెట్టి వూరు దాట తీసిందాక వకటే రంది. యిరికించి కూకుంటారు; వూడపెరుక్కోలేక మనం చస్తుంటిమి.

వెంక:— మన బంగారం మంచిదైతే కదూ, కంసలోణ్ణి అనటానికి? చేనిగట్టుకాడ తగువు రావటం యేంది? తెగపడి కొట్టుకోటం యేంది? అంతటితో వూరుకోక వూరిగుట్టు పరాయి లకు పట్టియ్యటమేంది? ... అయిపోయిన పెండ్లికి మేళమెందుకు గాని గ్రామంలో పెద్దమనుషులు చెప్పినట్టు వినుకోని రాజీ పడు కోండిరా బాలయ్యా!

బాల:— సరేకాని... చారిజీ కరుజులు, నా కెట్ట రావాల్నో ముందా దర్మం తేల్చవే! కరుజుల కోసమని అయిదు మేకల్ని పాతికె రూపాయలకు 'యలవలకు చలవలకు' అమ్మింది అందరికీ గుర్తేకదా! మొత్తం పైకం కర్నంకాంతయ్యా యింటికాడనె తన జేబులో పోసుకునె; పిర్యాదు డాకల్ చేసి మల్లీవచ్చేతప్పుడు "ఒక పావలా ఇయ్యయ్యా పిల్లోండ్లు యిళాయిచుట్టల మిటాయి తెమ్మని యేడిచారు" అని అంటేను తపతపా వెట్టిజేబు కొట్టుకుంటా 'పరాయివూళ్లో కుక్కకరిచినా యేసికట్టను కానీ కాసన్నా మిగల్లే' దని అన్నాడే! పూటకూలికని, చుట్టపొగాక్కని, బీడీలకని, సోడాలకని, కాఫీలకని, బిల్లలకని, బస్సాలకని, బిల్లబంటోతులకని, గుమాస్తాకని, అసలాయనకని, రాసినాయనకని, మద్దె మాట్లాడి నాయనకని, వొక దండకం చదివిండంటె నమ్మే! "ఈ యిదాన తిరుగుతునోన్ని నామాటేమిచెపుతా" వంటున్నాడే సిగ్గు బొట్లచేటూ!

వెంక:- మనం పైపైన పెట్టింది పాటింపుకొస్తుందా? నిక్కచ్చిగా సర్కారుకు పెట్టింది ఒకవరా కంటె యెక్కువ వుండదు.

బాల:— పైపైవి మాత్రం నాచేతి రూపాయిలు కావంటే? అవెట్టవుండనిచ్చి, సమున్లు తెచ్చిన పోలీసోడికి మూడు కోడిపెట్టలిస్తిని. వాయిదా వాయిదాకు, యిచారించే ఆయనకు నేతి దుత్తలే కాదు, కూరగంపలే కాదు, పెరుగుపండ్లే కాదు, నెత్తి బొచ్చూడేతట్టు మోస్తిని. యింతెందుకే? డబ్బు, జడ్డిగం కట్టి యెదపెట్టేనంటే నమ్మవే!!

3 వ:— నీకేసు గెలిపించుకుందామని నూరు బదవలుపడ్డావు. అవెన్ని జమకొస్తయంటలెద్దూ!

వెంక:- ఎందుకోయ్ యిదంతాను. పదిమంది పెద్దమనుషుల్ను మాపిటికి కూరుస్తాను. చెప్పినట్టు వినుకోండి...... అడివికిపోయిన ఆవుల్ని బందెలో పెట్టేరటే? వాటిగతేమైంది?

బాల:— వొకయిదాన నట్టమనుకున్నావా? మొన్న మా బావమరిది మేకలగుంపునుగూడా బందెలదొడ్డిలో తోలేరు.

3 వ:- యేమిరూలూసే ఇయ్యి? యీాండ్ల బొంద రూలూసూ... అడివిలోకి గొర్రెపోవొచ్చునంటగాని మేకపోగూడదంట. యిదెక్కడి మిడిమేలమే? అసలు మేక దోవతియ్యందే గొర్రెజాతి కాలుపెడుతుందంటె అడివిలోకి?

1 వ:- అంతంత చదువులొచ్చినోండ్లే? యింతమాత్రం తెలీదుకామల్నె వాండ్లకు?

2 వ:- అసలీరూలూసు చేసినోళ్లది తప్పురా! గుదిగుచ్చి నీవందరిని తిడుతున్నావు గాని.

వెంక:- ఈ రూలుసు చేసింది మనవాండ్లేనరా! వందలు వేలు పోసి ఫ్రొట్లుకొనుకున్నారే— వాండ్లు. అంటే భాగ్యవంతులన్నమాట. అందలంలోనుంచి కాలుదింపని భాగ్యవంతులకు అడవుల్లో వుండే కష్టాలేమి ఆకళింపవుతాయి. చేతులోకి కర్రపుల్ల కొట్టుకుంటే కేసు. మేకపిల్లకు ఆకుదూసుకుంటే కేసు. వాళ్ళు కష్టపడి అడివిని కాపలాకాస్తున్నా రనుకున్నారేమో! వట్టిది. వెనుకటి మొలకలు మానులు, గడ్డి కమ్మదల లేనేలేవు.

1 వ:— అసలు పూరింటికి దూలపుకొయ్య అయ్యే చెట్టే లేదాడ! యీాండ్ల పెంపకమేందో?

వెంక:— అందుకనే యిట్టాంటి చట్టాలు చేసేవాండ్లు యేకాడికి, గొడ్డూ గోదా మెడకట్టుకోని వూరేగే సంసార్లైతే

యీ కష్టసుఖాలు తెలిసుంటవిగాని "గొడ్డుబోతు కేమి తెలుసురా-బిడ్డనొప్పులు" అన్నట్లు యీ లక్షాధికార్లకు, యీ సీమకు పోయొచ్చినవాండ్లకు యేమి తెలుస్తవిరా? యెప్పటికైనా రైతు బిడ్డ పైకిరావాలె; అప్పటికి మన కష్టాలు యిరగడకావాలె, సరే మాపిటీడి కలుసుకుందాం. —

(తెర)



# రెండవ అంకము

## రంగము—౧

(ప్రదేశము :- వాములదొడ్డి ముందుభాగము)

(ప్రవేశము :— వెంకయ్య)

వెంక:- (వరిగడ్డితో వాములమీదికి యెంట్లువేసుతుంటాడు.)
(ప్రవేశము :- శంభుశాస్త్రిలు; శుద్ధశ్రోత్రియవేషముతో)
శంభు:— కృష్ణా! ద్వారకావాసా!

కం॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి—నెయ్యమును, నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు—దయచేయగదే !

వెంకయ్యా! పొద్దుకూకిందికదా! ఇంకా పనిచెయ్యాలటోయ్ !

వెంక:- పగలూ రాత్రీ పనిచేసినా పైటిబువ్వకు చాలటం లేదండీ రైతుపని! దణ్ణంపెడతా (అంజలి).

శంభు:— దీర్ఘాయుష్యమస్తు; వంశాభివృద్ధిరస్తు; మనోవాంఛాఫలసిద్ధిరస్తు; ధనకనక వస్తువాహనాది సకలైశ్వర్యప్రాప్తిరస్తు.

వెంక:- (ఇటూ అటూ చూచి) తల్లిసిగ్గొయ్య; ఇక్కడ యేమీలేదే కూచ్చోటానికి? ఆ కనపడే రాయన్నా తెచ్చేస్తా వుండండి. (పోబోవును).

శంభు :— వద్దోయ్! వద్దు. భూమికంటె పవిత్రమైన దేముంది? ఒకర్ని కష్టపెట్టటం సుతరాం నాకిష్టంలేదు. ఏమిటో వెధవది నామనస్సట్లా అయిపోయింది. మనం పుట్టింది యెందుకు వెంకయ్యా? ఒకర్ని కష్టపెట్టటందుకేనా? ఎట్లాగో కష్టానికి సహించి మనపని మనంచేసుకోవటం అన్నివిధాలా సుఖంకదూ!

వెంక :- మరేలేండి! కష్టపడి పనిచేసుకున్న వాండ్లకు మాత్రం సుఖం దక్కుతున్న దనుకున్నారా? చూడండీ! రెండు కాండ్లుకట్టి వ్యవసాయం చేస్తే (దొడ్డివైపుచూపి) ఆ వరిగె బొంద్దాయె. దీన్నిపట్టి గింజలెన్ని రాలుంటాయో ఆలోచించండి. పత్తి పదహారెకరాలుపోస్తే, అదేం తెగులో మలమలమాడి యిగురు కాయలు నాలుక్కాస్తే, అది సర్కారు తాశీలుకూ కూడా చాలక పాయె. ఇంక మాకు గుడ్డలెట్టాగో తెలియదు. నెంబరునూలు కొనుక్కోవాలిసి వస్తుందేమోనే దేముడా అని దిగులుగావుంది. ఇవేగా అయ్యా, మాపంటలూ మేమూను.

శంభు :— పండేవు; అసలేపండవు. సంసారిలో ధర్మం నశించిపోయింతరువాత యేమేడుస్తుంది. పాలికిస్తే భాగంతిన్నగా పంచిపెట్టరైతిరి. మక్తాకిస్తె, సరస్వతీ ప్రసన్నమేగాని, లక్ష్మీ ప్రసన్నం లేకపోయెను. పైపెచ్చు తిరగలేక కాళ్లు పడిపోవట మాయెను. బకాయీ, హోలుసాలుశిస్తుమొత్తం ఫయిసలుచేస్తేనే గాని మర్యాద దక్కదు. ఇక నే క్షణమూగను. ఆఖరుసారి చెప్పిపోదామని వచ్చేను. తరువాత వస్తాయించి లాభంలేదు.

వెంక :- (నేలమీద పుల్లతో గీతలుగీస్తూ)ఊ...ఎట్టాబ్బా! డబ్బుచిక్కేపాగీ, కనబడలేదే?

శంభు :- పీకెమీదికి వచ్చినప్పుడుకూడా మీాన మేషాలు లెక్కపెడుతుంటే యెట్లా?

వెంక :- యెటుతిరిగి, యీాబెట్ట తగిలిన నాలుగేండ్లనుంచే గాని, అదివరకు, మీామక్తా అడిగించుకోకుండా ముద్రముడుపుగా చెల్లించుకోలేదుటండీ? ఇప్పుడు యేమి అమ్మి యివ్వటానికి యేమీా లేకపాయెను. సావుకార్లను అప్పడుగుతుంటె, పాతబాకీల కింద పొలాలుకట్టమంటుండిరి.

శంభు :- ఆసోదెంతా నాకెందుకు? నానంగతేమిటో తేలనీ? నాకు గవ్వలతోసహా యిచ్చివెయ్యవలసిందే! బాబూ! బలేపాఠం నేర్పేవు. ఇక జన్మజన్మాలకూ నాభూమిని నీకు కవులియ్యను.

ఈ మొండి జాతర ఒకయేడనా, రెండేండ్లనా నీతో పడేది! ముక్కున్నన్నాళ్లూ పడికెముండేదే అయిపోయెను.

వెంక :— పొలం తొలగదీస్తే బకాయి యెట్లా తీరుతుంది? సొంతపొలం సావుకార్లు కట్టుకోని, కౌలుపొలం యీనాందార్లు తొలిగిస్తే, రైతు, నెత్తిన కొంగేసుకొని పోవాలిసిందే కదయ్యా! పడ్డగోడలు పడ్డట్టు వుండవులేండి. దయవుంచండి. ముందుకు కాల మాతుంది; మీ గుత్త గల్లాముల్లీగా కట్టుతాను.

శంభు :- నీ నంగినంగి మాటలకు నీ నక్కవినయాలకు, పర్యవసానం యేమిటి? "నేను మక్తా యివ్వను-భూమిని వదలను-వచ్చినదారినే తర్లవయ్యా" అని. అంతేకదూ! చచ్చి పిశికెడు దుమ్మయినా రావలసినది వదలను; భూమిని యిక నీక్రింద వుంచను.

వెంక :— పంటల్లేనప్పుడు భూమి యేరైతుకిచ్చినా అంతేనయ్యా! కాకపోతే దూరపుకొండలు నునుపుగా కనపడతయి.

శంభు :- నేనంత వెర్రివెంకటాయను కాదు. ముందుగా అయిదారేండ్లశిస్తు వడ్డీలేకుండా యిస్తామని నాకు రోజుకు లక్షా తొంభై వర్తమానాలు వస్తూవున్నవి; తెలిసిందా?

వెంక - నిజమే అయివుంటుందిలేండి. మాలో నీతి కట్టుబాటు లేనప్పుడు, ఒకరికొకరు ఒకరికొకరు ఆశపడటంలో యిద్దూర మేమున్నది? అది మన సొంతభూమే కదాఅని నమ్ముకోని, తరతరాల నుంచి బండిమీదబండి యెరువు వెంపలి తోలి, అదునెంబడి వ్యవసాయం చేస్తూ, కిద్దీపరచటంచేత, కన్నెర్రగావుంది. రెండోదేదీ ఆశించకుండా ఆభూమెమ్మను ఆశించుకున్న రైతును, కడుపుమీదనే కొడతారో యీపుమీదనే కొడతారో, మీదయ. యిస్తరేసి అన్నంపెట్టేరు; తిన్నిస్తే తిన్నివ్వండి, దించేస్తె దించెయ్యండి—మీదేభారం!

శంభు :- అట్లాఅయితే నాకు రావలసినగుత్త, వడ్డీతో అణాలుపైసల సమేతు చెల్లించు, తరువాత సంగతి చెబుతాను.

వెంక:- అయ్యో, నాయనా! పైకంపుట్టే పాగీవుంటె యింత కావాలెనా? అడివిలో ఆవులకాడ వున్న పిల్లోడికి బత్తెం పంపటానికి యిబ్బందిపడి చేటప్పాలు తెచ్చిపంపేనయ్యా!

శంభు :— నీవ్యవహారం యెంతసేపటికి శుష్కప్రియాలు, శూన్యహస్తాలు. ఆరునెల్లబట్టీ వాయించినమద్దెల "వ్రొడా, గట్టే?" అన్నట్టు నీసంగతి నాకు తెలియదు? ఇక నా తప్పులేదు. శిస్తుకు దావాపడేస్తాను. భూమిని యితరత్రాయిచ్చి అమరకపరుస్తాను. బ్రాహ్మడు దుర్మార్గుడంటే మరి లాభంలేదు. (లేచి కొల్లాయి గుడ్డ దులుపుకుంటూ) ఇక భూమికీ నీకూ రుణంతీరినట్టె!!

వెంక:- నాయనోవ్! చిన్నతప్పుకు పెద్దసిచ్చచేసి నాజీవనం తియ్యొద్దు. పెద్దసంసారాన్ని పుసూరు మనిపించొద్దు. మోటువాణ్ణి నేను-అన్నీ తెలిసిన పెద్దలుమీరు.

శంభు :— పో-వ్యర్థుడా! పనికిమాలిన సోదెచెపుతావ్. (వెళ్లబోవును.)

వెంక :— (అడ్డంవచ్చి, చేతులు బారగా జాపి) నాయనా! పిచ్చికమీద బెమాస్త్రరం యేస్తావా? మానుసంగా బతుకుతున్న వాణ్ణి; నా కూడు గుడ్డలకు కడతావా? నీవు దయతప్పితే దేశమ్మ కాకులమై పోవాలిసిందేకదూ! కోపం ఆపుకోని కూచ్చోండి.

శంభు :— (కూర్చుంటూ) నన్ను కొంప చేరనివ్వవా యేమిటి?

వెంక :— (దీనంగా) నన్నల్లరిపెట్టబాకండి. కంట వురి తెచ్చిపెడితే యెట్టా? పుట్టనిడబ్బును నేనెట్టా పుట్టించేదీ?

(ప్రవేశం :— కాంతయ్య - పున్నిశెట్టి.)

కాంత :- (పరకాయించి చూస్తూ) ఎవరా కూర్చున్నది?

వెంక :- మా యినాందారుడు శెంబుశాస్త్రుర్లుగారుకదూ!

కాంత :- ఓహో ! అట్లాగా ! ( కూర్చుంటూ ) కూర్చో ఫ్రాయ్ పున్ని శెట్టి. (దొడ్డిచాయచూచి) లక్ష్మీ కటాక్షంగా వుండే దొడ్డి ; పెద్దమ్మ విహరిస్తూ బావురు మంటున్నది. వీండ్లు బాకీలు తీర్చేదేమిటో ? మక్తాలు చెల్లించే దేమిటో ? అగమ్యాగోచరంగా వున్నది.

వెంక :— పొలమింత ఆనాపంగావుండి, దొడ్డి కిరుశ్రిమంటూ గాతంతో కలకలలాడుతూవుంటే సరిపోయిందిగాని, లేకపోతే యే ముందండి ? అయ్యగారి తలాకిలే కదూ ! !

పున్ని :— పండుతది – పండుతది ; బాకీ లెగ్గొట్టే యెవారం నేర్చుకున్న తరువాత పంటలు పండుతై ? పాడైపోతయిగాని!

శంభు :— బాబూ ! నూరేండ్లు వెళ్లబ్రితుకు— నా ఆయుష్యంకూడా పోసుకొని. ఒక్క పంటలేకాదు సెట్టీ ! " కుటుంబాలు కూడా " అను.

వెంక :- "బాకీ" అన్నతరవాత తీర్చకతప్పుతుందా ? కాకపోతే– ఇవ్వేళా, అన్నది రేపు; రేపన్నది-యెల్లుండి. అంతమాత్రం మాట వారే గాని, తుండుకుతుండు యెగ్గొట్టితే పడిమారి, వాండ్లింటిముందర కుక్కయి పుట్టైయినా తీర్చుకోవద్దూ ?

కాంత :– నీతికలవాడి కంతేకదూ మరీ !

శంభు :- నర్మగర్భాలూ ! నయగారి మాటలూను ! అరటి పండు వొలిచి చేతిలో పెట్టినట్టే !! లోపల లోకాలన్నీ ముంచుదామని ! !

వెంక :- ఎట్టాగన్నా అనుకోండి ! .. కర్ణంగారూ ! చీకటి పడి వచ్చారే ?

కాంత :– మరేంచెయ్యను ? నీవు బాకీ పరిష్కారం చెయ్యకపోతివి. రేపు వుదయాన, దావాకు వెడదాం రమ్మని మధ్య నా ప్రాణాలు తీస్తున్నాడు, పున్నిసెట్టి.

వెంక :— పరిష్కారమంటే యట్టా అయ్యా! ఇచ్చిన చెల్లు లేమో సరీగా చెప్పకపాయె. కాస్తో కూస్తో తీసేతకు వొప్పుకోకపాయె.

పున్ని :— అదుగో! అదే వొద్దనేది; దానికే వొళ్లు సిమ సిమా అనేది. యిచ్చిన సెల్లులు కాయితాలమీదనే "సేటలో మెలక్కాయ"లాలె కనపడుతుండెగా! ఇంకా నీయిష్టమొచ్చినోళ్ల కాడ సూపించుకో!! నే నొద్దన్నానా? ఆడ దొంగదాపిరిక మేముండది?

కాంత :- వెంకయ్యా! ఎందుకు లాభంలేని మాటలు? కాగితాలమీద లేని దృష్టాంతరాలు నోటిమాటలతో యెన్ని చెపితే యేమిలాభం?

వెంక :— అయితే నోటిమాటలు గాలికిపోవాలిసిందేనా? అబద్దమాడకూడదు, బతికేది మూడురోజులు. ఇచ్చిన చెల్లులన్నీ పత్రింమీది కెక్కనై, చెప్పండి? అల్లప్పుడు గ్రామదేవత కొలుపుల్లో యెల్లుండి బోణాలుపోస్తారనంగా రెండుపుట్లు వరిగెలు, పందుం కందులు, యేదుం జనుములు, ముప్పందుం సజ్జలు, కొలిచాను. మరసటేడు కోడెదూడల్ను గొర్రెగుంపును అమ్మి కంత రొఖం బిళ్లకుడుములాలె పదివందలిచ్చాను. ఏం పున్నయ్యా! ఇచ్చానాలేదా? రాసిచ్చిన నోటుమీద చెల్లెయ్యటానికి యిన ప్పెట్టెతాళపుచేతులు తమ్ముడు వూరికిపోతూ మొల్లోకట్టుకొపోయినాడని చెప్పి యేరే కాయితంమీద గుర్తురాస్తున్నామని నీవూ కాంతయ్యగారు నమ్మిస్తిరే! మొగముంది, అద్దముంది-చెప్పండి!

పున్ని :- సెప్పూ, సెప్పూ! యింకా సెప్పూ! వురువు బాకే లేదని సెప్పు. నీనోటి కెవడైన అడ్డంపెట్టిండా? యెందుకండీ కర్ణంగారూ! లాబంలేనిదానికి? గొడ్డునుకొని పలుపుకు పాలు మాలితే అయిద్దంటలేండి! పదింట్లో పదకొండూ!! కొండమీద పడ్డోడికి గాయాలెన్ని? దీనికొంత తగలేసి దావా డాకల్ నేపిచ్చి ఫైల్ జపుతు పెట్టితిమా అంటె ఆడికి తీటా తిమ్మిరి వొదుల్తాయి.

కాంత :— పున్నయ్యా ! కేక లెయ్యబోకోయ్ ! వెంకయ్యా! పొద్దునలేస్తే యిట్లాంటివి, నా తలవెంట్రుకలన్ని నాయెదుట జరిగేవి. ఏదని జ్ఞాపకం వుంచుకోగలను ? ఆ చెల్లులన్నీ నిజంగా నీవు యిచ్చివుంటే యీ జన్మలో కాకపోయినా ముందుజన్మలో అయినా ముజరా వచ్చితీరుతుంది. ఇవ్వకపోతే బాకీతీర్చిన వాడివౌతావు, ఇంతేనా ? ఈ భాగ్యానికి యిన్నాళ్లింత గుంభనగా బ్రతికి చివరకీవిధంగా చేసుకున్నావంటే నవ్వేబాట్లు. పండంటి ఫలానా వెంకయ్య కాపురం భీభత్సుచేశాడని పున్నయ్యకూ అప్రతిష్ట !! రెండో కంటివాడికి తెలియకుండా వున్న పొలమేమిటో అతనికట్టి లోచిక్కిన బాకీకి ఒక నోటు గీసి పారెయ్య ఫ్రాయ్ చూచుకుందాము. తరువాత రాజెవడో, రెడ్డెవడో! "నందో రాజా భవిష్యతి" అన్నారు. అంతేగాని కోర్టు కెక్కటమూ అంటే కోలుపోవటమేకదూ ? ఎవరు తిన్నట్టు ? "దూడ తాగినట్టా ? దుత్తలో పడ్డట్టా ?"

వెంక :- యెట్టాగైనా యీ బాకీ తీర్చి బయటపడాలెననే నేనూ తంటాలు పడుతున్నానండీ! అబ్బో, యెక్కడబాకీ యేవంక బాకీ! వడ్డీలకొడ్డీలుకట్టి, అబద్ధపులెక్కలు రాసి పెంచి పదియేలు చేసెనే! దానికితోడు, తీసేతలేకపోంగా యిచ్చిన చెల్లులన్నా సరిగా చెప్పక మోసంచేస్తే యేమితీర్చేదయ్యా !

పున్ని :- నిన్ను మోసంచేసినోడు యెవడో యీమట్టైపోతాడు. ముదనష్టం అయితాడూ అంట ! యేం మాటలీమాటలు! యీయెవారం యెవరికన్నా సెపుదాంపా నోటితో నవ్వుతారేమో? మొండికిపడి అప్పుతీసుకపొయ్యేనాడుండే దిలాసా తీర్చేనాడుండదేం గాచార కర్మమూ అంట !!

వెంక :- యెందుకరుస్తావుగాని యేమాత్రం తీసేస్తావో చెప్పూ ? యెంత తీసేసినా దండుగలేదు. కొంత పాపంపెరిగినట్లు పెరిగింది ; కొంత తీర్చింది.

పున్ని :- అబ్బో, అబ్బో! తీసెయ్యాలంట, యీన సామ్మె మనబ గిచ్చామనో! వక్కసిల్లిగవ్వ తీసెయ్యను. అమ్మో! యట్టాంటోడికీ యిదొక పాట్టైపోయింది. మాయింటికొస్తా నాకేమి తెస్తావు-మీయింటికొస్తాను నాకేమి పెడతావు. అట్ట యినా రొక్కరూపాయలు కారిస్తే సవలమో, దుగలమో, తీసెయ్యొచ్చు. తొండలు గుడ్లుపెట్టే పొలాన్ని కట్టటం! తీసెయ్య మని తగాదాపెట్టటం!! ఆహా! యేమి అందంగావుంది! అయ్యో, యెంకయ్యా! వూరికెందుకు తత్తవలు పడతావు గాని-తీసెయ్యటానికి నాబొడ్డుకాడి ముల్లెగాదు నాయనా! పావలా డబ్బుల కాశపడి నేనూ వకయ్యను నమ్మించి తెచ్చిన సామ్మెనే! ఆడ నేనూ నీయూలెనే అంటే యిచ్చినోడు సెప్పుతిరగేసి మూతి మీద కొడతాడు; తెలిసిందా?

కాంత :- నీకేమోయ్ నూరావులు కలవాడివి, ఒకావు నీ వనుకున్నన్ని పాలివ్వకపోతే లోపమా యేమిటి?

పున్ని :- బాగా సెప్పేరు! యెయ్యేండ్లెల్ల బతకండి. ఇంక యేరే మట్టికొట్టుకోని పోఅక్కరలే. యీ యావును సూస్తే తక్కినై కూడా జాడించి తంతై.

కాంత :- నీకొక రహస్యం చెపుతాను రా పున్నయ్యా! (ఇద్దరూ కొంచెం దూరంగా పోతారు) ఇతని పెడసరం యేమిటో మనం కనుక్కోవలసిందే! వెంకయ్యకు తీసివేస్తే వూరంతా అట్లాంటివారుకదూ!! మొత్తం వసూలు కావలసినట్టే! ప్లెయింటు పడవేశామూ అంటే దీనిజేజెమ్మ వసూలుకాదటగానీ- ముందు నా సంగతేమిటో తేల్చా.

పున్ని :- యేముండదీ? మద్దెన్నమే మనిమిసేత్తినిగా! మనం వక్కనాటోండ్లమంటండీ? తెంపేముండది? ఆ సిల్లర పద్దు అడగనులేండి. అన్నమంతా పట్టిసూడాలంటండీ?

కాంత :- అదేఖిటోయ్ వెధవ చిల్లరపద్దు !

పున్ని :- అయితే మీరే సెలవియ్యండి !

కాంత :- ఎందుగ్గాని, పైన అడిగినా నీ విచ్చవు. అవారు సతుకు లివ్వు.

పున్ని :- వోయి నాయనో ! యెద్దా, యెగసాయమా ? యాపారమా, సిల్లరబేరమా ? వూళ్ళేలటమా, వుద్దేగాలు సెయ్యటమా ? యేముండదాడ ? వున్నబాకీ లీయిదంగా వుండె. పాలం గల్లిస్తా సంతోసించి (నెమ్మదిగా) తక్కిందాడ రాబట్టుకో, నా అబ్బెంతరంలేదు.

కాంత :- మీ కల్లా గుడీ గుడిలింగాన్ని మింగే పత్రియిపే పైతేగాని తిక్క కుదరదోయ్. నామోస్తరు జాలిపేగులవాడు పనికిరాడు. నీ కెంత మేలుచేసినా ఇంతేగా? నీ బాకీకి కాంపౌండువడ్డీ కడితిని. అతని చెల్లులకు బారున కడితిని. అతనట్లా లబ్బున మొత్తుకుంటున్నా కొన్ని చెల్లు లసలే యెగనామం పెడితిని. నిజానికి వెనకటిమాటు లిమిటేషన్ పట్టిన నోటును తప్పుడుతారీఖు వేసి తిరగరాస్తినిగా ! ఆ విశ్వాసమేదీ ? నేను 'ఉఫ్' మంటే నీ బాకీ యెగిరిపోకపోయిందా ?

పున్ని :- పెద్దంగా అనబాకండి ! కాకపోతే ఇంకొక అంగళ వేసుకోండి. ఆడికి "చెలెరుకార్ల" యితయి.

కాంత :- ఎందుకీ వ్యర్థపుమాటలు ? నూటయాభై రూపాయలు ముమ్మాటికి నీ కిష్టమైయితే మాపిటికే యింటికి పట్టుకొచ్చి యివ్వు. కష్టమైతే మరొకతోవ చూచుకో.

పున్ని :- (తనలో) కాలాంతపు ముండకొడుకు—యీ దెమ్మ కడుపు మాడ ! అంతటితో పోతే నా నెత్తిన పాలుపోసినట్టే ! యెంకయ్యయేపు చేరుకోని వురువెగ నామంపెట్టిస్తే అప్పుడేం చేసేది ? యీడి బొందమీద పొయ్యాలిసినట్టే సార్థయేకులు సతుకులు!

కాంత :- ఏమిటోయ్! తెగాలోచిస్తున్నా వీ భాగ్యానికి ?

పున్ని :- అయ్యగారిది రామవాక్కేమైపామె. తప్పేదే ముండది ? ఇంక సాక్షులు సంబంధం మీాదేబారం.

(ఇద్దరూ తిరిగివస్తారు.)

కాంత :- వెంకయ్యా! నీవిట్లా రా, ఒక్కమాటు.

వెంక :— రామయ్య తండ్రీ! యెక్కడున్నావు నాయనా! (లేచివస్తాడు.)

(ఇద్దరూ కొంచెందూరంగా పోతారు.)

కాంత :- నీవుద్దేశ్యమేమిటో చెప్పు ? (ఇద్దరూకూర్చుంటారు).

వెంక :- ఏమున్నదయ్యా! అన్నిచెల్లులిస్తిని ; లేదంటుండె. ఇచ్చిన డబ్బు మళ్లీ యెక్కడ తెచ్చియిచ్చేది ?

కాంత :- నిజమేపాపం. నామనస్సుకు చాలాకష్టంగావుంది. వీడి కవిలె అంతా ఇల్లాపెరిగిందేకదూ! ఇంతదుర్మార్గమైతే యేం మనాయిస్తాం. దావా చెయ్యనిస్తూ ? వీడు మూట కట్టుకపొయ్యే దేమిటో చూస్తాను, గన్నేళ్లు, నూనేనూ.

వెంక :- దావా దాకా యెందుకు కాంతయ్యగారూ! ఆమాటంటనే నా మనసు 'కలక్కు' మంటుంది. కాకపోయినా- గెలిచి కట్టుకున్నా పాడుకోలేకదూ! నయానోనా భయానోనా యిక్కడే తీరుమానం చెయ్యండి.

(అక్కడ శంభుశాస్త్రి-పున్నయ్య)

శంభు :- నీది కుదురుపాటైనట్టేనా? మావుకాదు సొమ్ము యేట్లో మూటకట్టి పడేసినా, యెదురెక్కి వస్తుందోయ్. అది వెంకటేశ్వర్ల ముడుపు.

పున్ని :- అప్పుడే యీాడ వురుగ తెగినట్టు? ఇల్లలకంగానే పండగైందీ ? ఇచ్చేదీ తిరిగేదీ మా యవారం; పుచ్చుకునేదీ కచ్చేరీల కెక్కించేదీ మీా యవారం. మీాకేం అయ్యగార్లూ! యట్టపడ్డా పైచెయ్యే!! నాక్కాడా కాస్త సాక్షేనికి సాయంగా వుండండి.

శంభు :- సరే, బాగావున్నది. రోలొచ్చి మద్దెలతో మొరపెట్టుకున్నదట. ఈ సాలుతో అయిదు సంవత్సరాల భూమిశిస్తు బకాయిపెట్టి ఇవ్వక తంటాలు పెడుతూవుంటే నే నెవరికి చెప్పుకోను? నోటు నీ పేర ఆర్డరు వేస్తాను. పుచ్చుకుందూ బాబూ !

పున్ని :- అట్టా సెప్పూ ! నీకూ ఇయ్యాలిసుందండీ ? యాడ బడితె ఆడ యీాండ్లబ్బసొమ్ము లె అప్పులుసెయ్యటం— యియ్య బొయ్యేతలికి సేతు లెల్లికిలా మెయ్యటం.

(ఇక్కడ)

కాంత :- నాకు తోచినపద్ధతి చెపుతాను విను. నీ కొడుకు అడివికాడినుంచి వచ్చేలోపుగా భూమెంతా అతనిపేర రిజిష్టరు విక్రయం చేసిపారెయ్యి. నీకొడుకు రాములుచేత ముందుకు దావా పడేయించుదాము. తరువాత మనం మనం యెట్లాగో యేర్పాటు చేసుకుందాం,—దావా ఖర్చులకు నీవేం భయపడవద్దు, నేను భరిస్తాను. భూమి నీ పిత్రార్జితమేగా? రాములకు సంపూర్ణమైన హక్కు వున్నదందులో !

వెంక :- వుద్దు నాయనా ! వద్దు, అట్టాంటిమాటలు నాకు చెప్పబాకండి. అంత అకుర్తం చేసి నేనుమాత్రం రామ రామ అన్నదాక రాజ్జమేలుతానా ?

కాంత :- లౌక్యపద్ధతి చెప్పేను. తరువాత నీ యిష్టం. ఈ జాతిని పాపం తలచకూడదు. వట్టి ధనియాలజాతి.

శంభు :— ఒక్కపని చెయ్యవోయ్ ! నోటు నీపేర ఆర్డరు వేస్తాను. అసలుఫాయిదాలలో కొంత తీసివేసి పైకం పుచ్చుకుంటాను. ఆ ?

పున్ని :- కాలి త్తీసి నెత్తికి పూసుకున్నట్టున్నదీ సంతన.

శంభు :- పోనీ ! వడ్డీలేకుండె మానె, అసల్లోనే ఒకయాభై తగ్గించియ్యి పో. నీ పప్పేమి చిమడ లేదు లే !

పున్ని :- వురువు నాకెందుకండీ నీయవారం ?

శంభు :- ఆఖరుమాట; వంద తోసేస్తా, లాభసాటిబేరం. నీయిష్టం.

కాంత :- సరే అయితే ! దావా పడెయ్యనియ్యవ్వోయ్ ! అన్నిచెల్లులూ వదులుకొని రాజీ యేమిరాజీ—"పోయిరాజీ". ఒకవేళ నీవీ నష్టానికి యిష్టపడి రాజీచేసుకున్నా రాముల్ని యిష్ట పడనివ్వరు. గా్రమంలో పుల్లింగాలు పెట్టేవాండ్లు బోలెడు మంది. ఇంట్లో లేనిపోని పోరెందుకు పెట్టుకుంటావు ?

వెంక :— యెందుకు దింపుతావయ్యా ఆసులోకి ? యేకా డికో యిక్కడే కూలపెట్టండి. మావాడు నామాట దాటడులేండి.

( యిద్దరూ లేస్తారు )

పున్ని :- వాండ్లొస్తుండారు. నామాటొకటి యినండి, పెద్ద సామ్మ్మ సెరినగమన్నారుగా ! అసలు "టలసతుకులు" కదూ ! నగం "పోగుసతుకు" లిస్తాను. ఆడరెయ్యండి.

శంభు :— "సవాసేరులో బోడిపరాచకం" యెందుకు ? తెలిసేట్టుచెప్పు.

పున్ని:— సగం నాలుగొంద లిస్తానండీ ! యేదో బరవాసా గా అన్నాను. నీకు రాజీ అయితే వాండ్లువచ్చేతలికి నిన్ను డబా యిస్తావుంటా. నన్ను నీవు బతిమిలాడకో.

కాంత:— నామాట యెట్లాంటిదో కనుక్కోలేకపోతివే ! నీవు కాపువు, నేను కరణాన్ని, నీకూనాకూ లంకెగాని మధ్య యీకోమటివాడితో కావలసింది యేముంది ?

వెంక:- మరెట్టాగయ్యా ! దిగినప్పటినుంచి కర్చులకు పైకం కావలెనే ! యెక్కడనుంచి తెచ్చేది ?

కాంత:- నీకదంతా యెందుకులేవే ! రాముల్ని రానీ, వాడితో కలిసి మాట్లాడి యేర్పాటుచేస్తాను. నీదంతా తిరిగి

పోయింది. సరేకాని పొలానికి అజమాయిషీకి వెళ్ళితే నడవలేక తలప్రాణం తోకకొస్తున్నది. బండి వడ్రవాడు చేశాడు గాని దానికి నీబావనెల్ల, పొట్టెద్దును సప్లయిచెయ్యి.

వెంక :- (తనలో) పాలిపొలమైనా చేసుకొని బతక్కుండా అరక్కుంది యెద్దుమీద కన్నేస్తె యేంచేసేది?

కాంత :- ఆలోచిస్తున్నావేమిటి? నీకేం సంసారివి. నాలు గావులు ఈననైయున్నవికామాలును. నాలుగు కోడెదూడలు పుట్టగూడదు? అదృష్టముంటె; ఇక పోదాం రా.

(శాస్త్రి-సెట్టి వద్దకు వస్తారు)

పున్ని :- అయితే యప్పటికప్పుడు యిస్తాలెమ్మని అరిసేతిలో వైకుంటం సూపిస్తుంటే సరిపోద్దిలెమ్మనుకున్నావు. అయిపుట్టి నోడికీ యీ పదమేఅయితే మా బండి సాగేదెట్టాఅంట.

శంభు :- సిన్నా పెద్దా లేకుండా మొహమంతా కండ్లుచేసు కుంటా వెందుకోయ్. కాకపోతే యీపెద్దమనిషి వెంకయ్య నాకు బాకీవుండి పత్రంరాసిచ్చాడు, అది ఆర్డరు వేసిస్తాను. వసూలు చేసుకో.

కాంత :- ఈ తగాదా యేమిటి?

పున్ని :- సూడండి కాంతయ్యగారూ! నోటు వాయిదా కూడా యెల్లిపోవచ్చె, గట్టిగా మాట్లాడితే యెంకయ్యానోటు ఆడ్డరు యేస్తానంటాడు.

కాంత :- అచ్చమ్మ పెండ్లిలో బుచ్చమ్మ శోభనంలాగున్నది. తరువాత చూద్దాంలే!

శంభు :- (తనలో) వీడు నరాంతకుడు. వీణ్ణి మంచి చేసు కోకపోతే లాభంలేదు. హిరణ్యశ్రాద్ధం తగలెయ్యక తప్పదు. (ప్రకాశంగా) కర్ణంగారూ! ఇట్లా దయచెయ్యండి, (కొంచెం ఆవలకు తీసుకొనివెళ్ళి రెండుచేతులు పట్టుకొని) సాటిబ్రాహ్మణ్ణి,

పెద్దవాణ్ణి, కాస్తో కూస్తో చదువుకున్నవాణ్ణి, పిల్లలుగలవాణ్ణి; యేదో బాకీవున్నట్లు నటించి ఆర్డరు వేద్దామనుకున్నాను. ఈరైతు యిప్పట్లో కోలుకొని నాకు మర్యాయిచ్చేలాగు కనుపించటంలేదు. ఈరహస్యాన్ని బయటపెట్టకుండా నాకు అండగావుండండని పార్థన. చందుృడికి నూలుపోగు వతుగా పదిరూపాయలు సమర్పించుకుంటాను. ఈ దర్భముడి వుంగరం తమ వద్ద వుంచండి (జేబులో వుంగరంవేయును).

కాంత :- పెద్దలు ; మీారీపనికి ప్రోత్సహిస్తున్నారు. నిరాకరిస్తే చిన్నబుచ్చుకుంటారు. సరే, రండి ఆలోచిద్దాం!

(వెంకయ్య-సెట్టి వద్దకు వస్తారు.)

వెంక :— యీచిక్కుల్లోనే ఆబాకీకూడా యెందుకు పెడతారయ్యా. మమ్మల్ని కొన్నాళ్లపాటు బతకనియ్యరూ ?

కాంత :- భయపడబోకు, నీబాకీలు తీరే రోజు వచ్చింది. ఎప్పటికైనా తీర్చిందే తప్పుతుందటోయ్! ఋణశేషం, రణశేషం, అగ్నిశేషం వుండకూడదు. ఏదోవున్న దాంట్లోనే ముడిపెడదాంలే!

వెంక :- ఇంకేమున్నదయ్యా! వుట్టికి నాలుగుచేర్లూ తెగిపోయినట్టే.

కాంత :- పున్నయ్యా! నీవిట్లా రావోయ్. (అవతలకువెళ్లి) నీవుద్దేశ్యమేమిటి ?

పున్ని :- యేముండదీ? మన బాకీకింద పొలం; బేంబడిబాకీకింద యిల్లు సరిపుచ్చుకుందామ్.

కాంత :— చాలా అప్రతిష్టపడతాం.

పున్ని :— మీారు మొన్న చేబదులు తీసుకున్న ‘ పాలంగళ్లు ’ వ్రేదులుకుంటాలే!

కాంత :- ఏమిటి? ఆ యాభైరూపాయలా! సరే అందు కాళపడతాననుకో, మీారందరు మంచివాండ్లుగానే వుంటారు.

"ఎదురుగావచ్చినమ్మ యెండిపోయిం" దన్నట్టు మధ్య నాకొస్తుంది గ్రామంలో చెడ్డపేరు. నరే-రా.

పున్ని :- (తనలో) రోగం; మాయరోగం. నిలువుదోపులు దోస్తానే యిట్టాంటి యేసాలు.

(నమీపిస్తారు.)

కాంత :- వెంకయ్యా ! శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాను. ఇంకా చేసి చూస్తాను. ఈశ్వరేచ్ఛ యెట్లావున్నదో తెలియదు. కుర్రవాణ్ణి రానీ కలిసిసంప్రదిద్దాం...ఆ...చీకట్లో యింకా యెందుకు? వెడదాంరండి (వెంకయ్యతో రహస్యముగా) నిదానంగా మాట్లాడుతాను.

(నిష్క్రమింతురు.)

## రంగము— ౨

ప్రదేశము : గ్రామచావడి.

ప్రవేశము : కోటయ్యా, బాలయ్యా, తలయారి పోలు, మునసబు లక్ష్మయ్యా, కర్ణం కాంతయ్యా, రివిన్యూ యిన స్పెక్టరు రంగారావు.

కాంత :– చదువే నేర్చుకోనివుంటే మమ్మలను బ్రతకనిచ్చేట్టు లేదే ? నీటితీరువ యెవరు కడతారనుకున్నావు ?

కోట :– తీర్వ నిరుడు ముచ్చవలమేగదండీ కట్టింది ?

కాంత :– ఈ యేడు ఫష్టుక్లాసు ఛార్జీ చేశారు. తెలిసిందా. (రహస్యంగా) జమాబంది మామూలుతోగూడా లెక్క-వేసుకో !

బాలయ్య :– నే నెంత కట్టేది ?

కాంత :- (పుస్తకం పేజీలు తిరగవేసి) పదిరూపాయ లియ్యి.

బాల :- నాకు తీరవా యేమన్నానా ? తొలి కిస్తీలో పది రూపాయ లివ్వనే యిస్తిని. పుట్టరాని రోజుల్లో యింత అదనంగా నెత్తినేస్తే యెక్కడ మోసేము ?

రంగా :- ఏమిటోయ్ ! యీ గోల. సిరుటి రశీదుల ప్రకారం యివ్వరాదూ ?

బాల :- రశీదు లియ్యలేదయ్యా ! రెండుమూడుదఫా లడిగితే యియ్యకపోతేను, యేడిసీళ్లకు యిళ్లు కాలతయా అని వూరుకున్నాము.

లక్ష్మ :- ఇచ్చిన రశీదులు పారవేసుకునేది, ఇవ్వలేదని గోల పెట్టేది. అదీ యీ రైతుజాతికున్న తెగులు. (ఉరిమి చూచి) మాకిదే పనికాదు. తక్షణం పైకం కట్టు. బేరాలు చేస్తా వేమిటి ? ఇది బఱ్ఱిగొడ్ల బేర మనుకున్నావా ? ఈ నెల ఇరవై నాలుగో తేదీకే తాలూకా చిఠా మర్తరఫ్. ఇక వీలులేదు. జప్తు జరుగుతుంది. యిబ్బందిపడతారు.

కోట :- సరే యియ్యరా ! దర్మమే జయం !! రశీదు రాయండి.

కాంత :- ఇన్నిమాట్లైనదు రాస్తాదు ? ఆఖరుకిస్తీలో ఒక్కమాటే యిస్తాములే.

కోట, బాలయ్య :- (తలగుడ్డ చెంగున మూటవిప్పి పైకంయిచ్చి వెళ్ళబోతారు.)

కాంత :- మీరు వీధిలోకూచొని వుండండి. వెంకయ్య వస్తాడు. అందరం కలిసి ఒకసంగతి మాట్లాడవలసివున్నది.

(కోటయ్య, బాలయ్య, వెలుపలికి వెళ్లుతారు)

లక్ష్మ :- వరేయ్ ! తలారి పోలా ! వెంకయ్య తక్షణం వున్నవాణ్ణి వున్నట్టు పిల్చుకొనిరా.

పోలు :- (తలపంచె చెంగున వున్న పొగాకుమూట విప్పి కొరుకుతూ) యీమెల్ దాక పోయొచ్చిన్ను దొరా ! యింకా పొలాన్నుంచి రాలేదన్నరు. మల్లీ పోయొత్తలేండి. (నిష్క్రమించును.)

రంగా :- నేను చెప్పిన సంగతి యీవచ్చినవాండ్లతో ప్రస్తావించక పొయ్యారూ ?

**కాంత:-** వెంకయ్యను రానివ్వండి. అతను పెద్దకాపు. అంటే కథానాయకు డన్నమాట. అతను దోవ తీస్తేనేకాని తతిమ్మావాండ్లు వెంటరారు. కాని, వెంకయ్యను ఆలశ్యంగా వచ్చినందుకు కొంచెం దబాయించండి. మెత్తనివాడు కాబట్టి వత్తుపోయి మనమాటకు సరేనంటాడు.

రంగా :- దాం దేమిటి గాని— జమాబంది వెళ్లిపోయినా నా మామూ లివ్వకనేపోతిరి ?

కాంత :- రాను, రాను, మా గారి మోక్ష్యగం, గొంగడి భోజనం వతు అయిపోయింది. అన్నీతప్పులే! అందరూ బెదిరించే వాండ్లే!! బిళ్లబంట్రోతు మొదలుకొని తహశిల్దారు, డిప్యూటీ కలెక్టరు వరకూ అందరూ గుర్రుగిమేవారే! నక్కనుచూచిన వాండ్లందరూ వేటగాండ్లేనండీ!! ఎంతమందికని మామూళ్లివ్వగలం? అసలు డబ్బెక్కడినుంచి పుట్టించగలంచెప్పండి ?

లక్ష్మి :- వారి నడిగే దేమిటి? భూమిమీదపడ్డ నీటిచినుకు లన్నీ సముద్రంలో పడుతున్నట్లు, యెక్కడెక్కడివాడూ రైతు మీదపడి పీక్కొని తినవలసినదే !

కాంత :- అయినా, రైతువద్ద మనం లంచంపుచ్చుకన్నట్లు ఫిర్యాదువస్తే మనలను దోచుక తింటూవున్న అధికార్లు మనలను మన్నించి పెడతారా ? పైపుద్యోగులకు పట్టియిస్తారా ?

లక్ష్మి :- ఓహూ! ఈలంచాలవల్ల తరింపువున్నదనుకొనే యిస్తున్నామా? "సానకింద చెక్కిన పూజా, సర్కారుకు చేసిన మేలు, వృధా వృధా" అని మాఅమ్మమ్మ చెపుతుండేది.

రంగా :- ఎన్నడూ లేనిది చాలా విసుగ్గామాట్లాడుతున్నారే! మీకంత కష్టంగా వుంటే ఊరుకోండి.

**కాంత :-** అబ్బే! నేను ప్రపంచధర్మం చెప్పేనండీ! **మీ విషయంలో అట్లా అనటానికి నోరువస్తుందా? రంగారావు పం**

తులుగారి పరిపాలనా అంటే సాక్షాత్తూ రఘురామచంద్రమూర్తి పరిపాలనమే కదూ! మేము గ్రామంలో గైరుహాజరైనా, తెలిసో తెలియకనో చేసిన ఆక్రమణ కమ్మీలు ఒకటీ అర కండ్లబడినా, సర్కారు దస్తులోవి అవసరాన్నిబట్టి వాడుకున్నా, కడుపులో పెట్టుకొని కన్నతండ్రికంటే మిన్నగా కాపాడుతూవున్న అధికార్లు మీరు. అల్లాంటి మీకు మామూలు సమర్పించుకొనకపోతే, తినేది తింటూ సమయందొరికితే పై యధికార్లకు సస్పెండుకు సిఫార్సుచేసే కృతఘ్నులకా యివ్వవలసినది?

లక్ష్మ :- తహశీల్దారుగారి నంటవాడు గుర్రపువాడు మాత్రం మీరు చెయ్యరటలెండి, పంతులుగారూ! కాకపోతే- “గానుగలోదే గంటెడూ!” మీకుగూడా యీ వసూలవుతున్న దస్తులోదే కర్చుపెట్టి, మార్చి ముప్పై ఒకటవ తేదీనాటికి యే విధంగానో పూర్తిచేసుకుంటాము.

(ప్రవేశము :- కోటయ్య, బాలయ్య; తిక్కాడితో జనపనార వొడుకుతూ, వెంకయ్యగూడా.)

వెంక :- దండాలండి!

కాంత :- భగవతార్పితం. బలేబాగా చేశావ్రోయ్! “విత్తనాలకు వెళ్ళినరెడ్డి, వ్రూదెమడిచిన తరువాత వచ్చాడట” అల్లావుంది; పంతులుగారు వచ్చేరని పొద్దునే నోటీసు పంపి తిమిగదా! ఇంటివద్ద వుండకూడదు? ఎల్లకాలం వుండేపనులేగా!

వెంక :- కాలం రెక్కలు కట్టుకొని పరుగెత్తుతుంది. యేఅదున్లో చేసేపని, ఆ అదున్లో చెయ్యకపోతే యిక రైతు మూటకట్టుకునేది యేముందండీ! యెవరైనా అంతే అనుకోండి. పక్షులంటివాటిని చూడండి ......

రంగా :- నీ వేదాంతం కట్టిపెట్టి, ఆలస్యానికి ముందు సంజాయిషీ చెప్పు. నోటీసు ప్రకారం హాజరుకానందుకు ప్రాసిక్యూషను రాస్తాను. ఏదీ కాగితం?

వెంక:- నాకు తెలియంగానే బయద్దేరేనండీ! యీతప్పు కాయండి.

రంగా:- చవటకాళ్ల పెద్దమ్మవు, నీవు వచ్చిందాకా మేమిక్కడ పడివుండవలసిందేనా? ఒకమాటు మంచి చురకంటిస్తేనేగాని రోగం కుదరదు.

కోట:- అయబ్బ! యిదేమో మిడిమేలంగావున్నదే! ఇది చివరదాకా నిడివేరే బిడ్డేనా? తానొచ్చేది ముందుగా మాఅందరికి కబురైనా వస్తే బాగుండేది.

కాంత:- అయ్యా! తమరధికార్లు, తండ్రివంటివారు. రైతు బిడ్డల్ను తమరు క్షమించకపోతే దిక్కెవ్వరు? (రైతులవైపుచూచి) అధికార్లు వస్తారని తెలిసినప్పుడు పనులుమానుకొని నిరీక్షిస్తూవుండాలి. ఒప్పులూ, కల్లోలాలూ కాకుండా తాశీలు బేబాకీ చేద్దామని బాబుగారొస్తే మీరు గ్రహిస్తేగా?

బాల:- "అద్దంకోరి ముద్రియీపుతప్పినా, బుజం తప్పదండీ." పన్నియ్యకపోతే బండెత్తుతారు. యెన్నిబదవలు పడ్డా తాశీలు తప్పతుందంటగాని—చెరువులో నీళ్లయిపాయె; రాగి పైరు నిలువున యెండిపోతంది, మామూలాలు పల్లాలకు పన్ను రిమీసన్ యిప్పించండి.

రంగా:- పండించి పోసుకోటానికి పెద్దకొడుకులు. పన్ను పెబ్బలంటే పీడించి చంపుతారు. కబళమంటే నోరుతెరచి— కళ్లెమంటే నోరుమూసే గుర్రంలాగు వున్నది రైతుల ధోరణి. ఛీ, ఛీ! అసహ్యంగావుంది.

వెంక:- నాయనా! "ఛీ-ఛా" అని యెందుకంటారు? అయింది, రైతుపని అయింది. యింకేమిరైతు! పోతున్నవి వకదానెంబడి వకటి. వాటితో మర్యాదలుకూడా మట్టికొట్టుకొని పోతున్నవి.

రంగా:- (గుర్రుమంటూ) పటప్! అతిగా వాగబోకు. సందర్భములేని వెర్రిమాటలు మాట్లాడుతావేమి?

వెంక:- కోపగించుకొని తిడతా వెందుకు? రైతులు తమ కష్టాలను సర్కారుకు చెప్పుకోకపోతే, గుళ్లో దేముడికా చెప్పు కునేది?

లక్ష్మి:- ఎందుకు వెంకయ్యా ఆ యధికప్రసంగం?

రంగా:- మునసబుగారూ! "చెరుకా బెల్లం పెట్టవే అంటే, పెడుతుందా?" ఎందుగ్గాని, బాకీలిస్టు పట్టుకరాండి. ముందు అతనింటికే వెళ్ళి కూటికుండలు కంచం బోకీలు బయట పడేస్తేనే గాని తిక్క కుదరదు.

కోట:- ఆ.. శానాదాక వున్నదే? సరే రాండి పడే స్తురుగాని... (తల వూపును)

రంగా:- ఏం... కొట్టేట్టుగావున్నదే? మునసబుగారూ! ముందు రిపోర్టువ్రాయండి పోలీసు కున్మకక్కుకు.

కాంత:- ఇది సమయంగాలేదు. ఇట్లారండి చెపుతాను (రైతులను కొంచె మావలికి తీసుకొనిపోయి) ఏమిటరా పెడవా దన్లూ! పోలీసులేమిటి, బేడీలేమిటి, రూపాయివస్తువ లకాకు వేలం యేమిటి? మీకు అమానుషం— మాకు చెడుపేరు. ఆయన బండి యెడ్లకు, పాడి బర్రెకు మేత కావలసివుంది. దొడ్డికొక మోపు వరవడి పెడితే రెండు బండ్ల గడ్డి అవుతుంది. అది వారిల్లు చేర్చి చక్కారండి, చల్లపడుతాడు. "కన్నుతగిలే పుల్లను కనిపెట్టి తిరగ" మన్నారు.

కోట:- మాగొడ్లే అరచకలాడిచచ్చే రోజుల్లో యిట్టా యిరక టంలో తోస్తే యెట్టా? పోయిన తడవ యీాయనకు పైరాయిన వుచ్చినప్పుడు, రెండుబస్తాల గోంగూర—గంపెడు పండుమిరప కాయలు-రెండురూపాయల కొత్తిమేర్లు-నూగులు-యిన్నితాళ్లూ, తగుళ్లూ కావాలంటే యిచ్చేమంటావా? లేదంటావా?

కాంత:- ఈమాటవింటే ఆయన అగ్గిమీద గుగ్గిలమౌతాడు. మొత్తానికి గోళ్లతోపొయ్యేదానికి గొడ్డళ్లు తెప్పిస్తారు. తేదని మొండికి పడితే యెట్లా? ఇంకొక గొడ్డంటే మీరు మేపుకోరు?

వెంక:- అడివికి తోలినగొడ్లు అడివిలోనే యిబ్బందులు పడటం, యింటికాడి గొడ్లకు పేగులు కాటికవట్టి దట్టెలుకావటం చూస్తూనే యట్లా వూళ్లో రైతులకు చెప్పేదండీ? కాకపోతే మీరడిగేరు కాబట్టి యిబ్బందులుగాని సబ్బందులుగాని నేనొక్కణ్ణే వక అరబండి గడ్డియేసి పంపుతాను, సంతోషించండి.

బాల:- నేను, పదిరోజులనుంచి దొడ్లో మేపులేక గొట్టం దూసి యెద్దులకు యేస్తావుంటే, గంగ మెయ్యావు కోటయన్నా! కరిదూపంపారిన దంట్లుకావటాన్కో యేమోనే! కడుపులో మంట కామాలు, తల్లిసిగ్గొయ్యి పేగులు తెగ పారుకుంటా చావుకు తయారైనయి.

కోట:- యెవరుదస్తై ఆయనకేమిరా? "వూరిమీద వూరు పడ్డా-కర్ణంమీద కాసుపడ" దంట. కాదండీ కాంతయ్యగారూ! మీరు పీక్కొని మమ్మల్ని తినేదికాక పైయోరికికూడా పట్టిస్తుంటే మెట్లా? యీ వుద్దేగస్తులకు వక్క-రోజున యీ మకాముల్లో అయ్యే కర్చుతో గ్రామమొత్తం మనుషులు వొక నెలరోజులు దిగుల్లేకుండా తిని బతకొచ్చు. వూళ్లోవాళ్లసొమ్ము తేరగా వస్తున్నకొద్దీ యింకా రావాలెననే ఆశ. యేం మాయరోగాలా! వందలకొందలు నెలజీతా లొస్తున్నాయే! అవి యే పాయిలో పోస్తున్నారు? వొక్కొక్క చెమటబొట్టు బూమెమ్మకు వొప్పగించి వొక్కొక్క గడ్డిపోచ పోగుచేసి, వొక్కొక్క నెత్తురుబొట్టు కర్చుపెట్టి వొక్కొక్క కంకీ వొక్కొక్క కాయ సంపాదించుకుంటున్నామే! ఆ కష్టపుకూటికి ఆశపడటం బాగుపడటానికేనా?

కాంత:- మాటలతో ప్రయోజనం లేదు. మీ మేలుకోరి చెప్పేను. ఇవ్వటంలో విలువ వున్నది. ఎవరో యల్లాయకు

పుల్లాయకు పనికి పాలిన బిచ్చగాడికి, కుంటి గుడ్డి గులాములకు యిచ్చిందైతే పేరుప్రతిష్ట వుండదు. ఉన్నతోద్యోగులకు యివ్వటం గనుక, దీనిలో గౌరవం వున్నది. వారి అనుగ్రహం సంపాదించుకోటానికి వీలున్నది. ఇట్లాంటి మనక బిచ్చాలతో మన కర్యేదేమిటి హార్యేదేమిటి? నోటితో లేద నేది చేతితో లేద నండి. ఊ...ఏమిటి...మీకిష్టంలేనట్టున్నదే! సరే పోదాంరండి, ఒక వెంకయ్య యిస్తేమట్టుకు యేమూలకొస్తుంది? ఆలస్యం చేస్తె నేనేమో చెడగొట్టినని ఆయన అఘోరిస్తాడు. (లేచి వెళ్ళును.)

రంగా:— ఏమైనా దోవలోకి వచ్చిందా!

కాంత:- రాతిబొమ్మకు చక్కలిగింతలుటండీ? నల్లమేకను తేవలసిందే! వీండ్ల నిల్లా వదిలిపెడితే మర్యాదదక్కదు. కందిగింజను కాపువాడిని మంగలంలో పెట్టి వేపితేగాని రుచిలేదు.

రంగా:- అయితే, ఏదైనా సాధనాంతరం చూడండి!

కాంత:- చూచేదేముంది? వీండ్లకొక నెంబరు జాయింటుగా వుంది. దాని మొత్తం వీండ్లవద్దనే వసూలుచేద్దాం.

రంగా:- ఒకవేళ యిదివరకే వసూలై చిఠాన జమకట్టబడి వున్నదేమో చూడండి, కొంపతవ్వి!

కాంత:- ఇంతవరకు చిఠామీద కలంపెట్టనిదే!

రంగా:- అయితే వసూలైనవి జమ యెక్కడరాస్తున్నారు?

కాంత:- శాస్త్రప్రకారం యేడిస్తే తెల్లవారుతుందిటండీ! మేమో కొండగుర్తులు రాసి పెట్టుకుంటాములెండి.

రంగా:- వాండ్లవద్ద రశీదు లున్నవేమో!

కాంత:- మీరాభయం పెట్టుకోవద్దు. జన్మేపీ, రశీదు లుండవు. అధవావున్నా, అది యే ఫసలీదో బ్రహ్మాంతవాడికి గూడా తెలియదు. మొత్తానికి డిమెండురాస్తాను. సంతకం పెట్టండి.

రంగా:- థేంక్యూ ! పెట్టండేమిటి ? పెట్టితీరవలసిందనండి. అధికారికి అనధికారికి తారతమ్యం కనిపెట్టకుండా, బిర్రబిగిసి, మహా తలబిరుసుగా, స్వతంత్రంగా— వెధవరైతు మాట్లాడుతూ వుంటే, యిక దేశం బాగుపడేదేముంది ? ఒకరిద్దరికి ప్రాయశ్చిత్తం మైతేనేగాని అందరికీ బుద్ధిరాదు.

( రైతులు దగ్గరకు వస్తారు. )

రంగా :- అయితే ఆ నెంబరుకింద యెంత బాకీ వున్నదన్నారు?

కాంత :- (పుస్తకం పేజీలు తిరగవేసి) జాయింటుపట్టా ఇరువైనాలుగో నెంబరు కిందకదండీ ? నూరురూపాయలు బాకీ వున్నది.

లక్ష్మ :- ఏమరా ! తెచ్చివ్వరాదూ ? వారిచేతిమీదుగా రశీదు రాసిస్తారుగా !

వెంక :- బాగా చూడండి. వుమ్మడిబీటికి మాహిస్సాలు ఇదివరకే యిచ్చాము.

రంగా :- ఇస్తే ? అవి సొంతాలకింద జమకట్టేరేమో !! నెంబరుమీద బాకీ కనుపిస్తున్నది. తక్కినవాండ్లందరితో యెవరు తంటాలుపడతారు ? మీ దగ్గరనే వసూలుచెయ్యటానికి మా కధికారం వున్నది.

కోట :- వుంటేమట్టుకు వూరుమ్మడిబాకీ, యిచ్చినవాండ్లదగ్గరనే మళ్లీ వసూలుచేస్తావుటయ్యా ! ఎందుకు పుట్టిందో యీ దురాగతం.

లక్ష్మ :- ఈ యవస్థకంటే యెవరివాటాభూమిని వారు సబు డివిజన్ చేయించుకోలేకపోయినారా ?

కోట:- చేయించండయ్యా అని మొత్తుకున్నా మీారు చేయిస్తేగా !

రంగా:- ఆశీర్వచనాలకు పిల్లలు పుట్టరు. పది రూపాయలు కర్చుపెట్టుకుంటే చేయించకపోయినారా? సంగీతాలకు చింత కాయలు రాలుతవిటోయ్!

కోట:- లంచాలిచ్చి పన్లు చేయించుకుంటేసరి, లేకపోతే యీ యిధంగా యేల్తారన్నమాట.

రంగా:- ఎక్కువగా మాట్లాడితే మెడపట్టి గెంటేస్తాను. ఎవరోయ్ బంట్రోతు!

వెంక:- అదుగో, అద్దీమాట! దొర తలుచుకుంటే దెబ్బలకు కొదవా!

రంగా:- ఏమిటండీ యీ మొండి పీహా? వీండ్లకేమో హాస్యంగావున్నది. 'రైతుపెద్ద' కాబోలు; ముందు వెంకయ్య యింటికే వెళ్లి వాకిట్లో యెద్దులను జప్తుచేద్దాం పదండి. ఎవరడ్డుకోగలరో చూద్దాం. (దిగ్గున లేస్తాడు.)

వెంక:- యేంటీ? యేంటీ? (కోపోద్రేకముతో వణుకు.)

లక్ష్మి:- (సందేహముతో) పశువులను జప్తుచేసి తోలుకొని వస్తారు.

వెంక:- ఎవరు— ఎవరు? ఆయనా? మీరా? రాండి నా వాకిట్లోకొచ్చి యెద్దుమెళ్లో పలుపు పట్టుకునే మొగవాడెవడో చూద్దాం, ఊఁ... రాండి!

రంగా:- ఇంకా చూస్తారెందుకయ్యా? బయలుదేరండి. ఇట్లాంటి కశ్మైన్నలను యిదివరకు నా తలవెండ్రుకలంతమందిని చూచాను.

కాంత:- (తనలో) కథ అడ్డంతిరిగింది.

లక్ష్మి:- బాకీపడినప్పుడు పశువుల్ని పట్టుకోటం పూర్వంనుంచి వున్నదేలేవే!

వెంక :- (ఆవేశముతో) యెవరి పసువుల్ని పట్టుకుంటే యెవ రూరుకుంటారు ? పసువుల్ని పట్టుకోబట్టే—యిరాట్రిజకొడుకు యీరుడుగా మారేడు. పసువులజోలికిపోతే గాజులు కడియా లుగా మారుతై, జాగర్త.

రంగా :- ఇతనికి పిచ్చా, మదమా ? ఏమిటీ వాగుడు ?

వెంక :- తినేది ప్రజల సొమ్మాయెను. మదంపట్టదూ ?

లక్ష్మి :- (రహస్యముగా, రంగారావుతో) సమయముకాదు తగ్గండి.

కాంత :- (మాట్లాడవద్దన్నట్లు రంగారావుకు సౌజ్ఞచేయును.) పోనీ, వెంకయ్యా పసువుల్ని......

వెంక :- యిక పసువుల మాట యెత్తితే పసువుదక్కదు. సర్కారుకు యిట్టాంటి బాసతప్పుడు బాకీలు పడింది మేమా నూం పసువులా ? (అటు ముఖంత్రిప్పి) కడుపులో తాటేకులమంట పెట్టినట్టైంది. అందరి గొంతుల్లో గతుకపోసే నోరులేని పసు వుల్నా ? (కోటయ్య, బాలయ్యల చేతులుపట్టుకొని) రండిరా పోదాము ! ఎట్టా కావాలిసివుందో అట్టా అవుతుంది. చచ్చేపెం డ్లాన్ని "అమ్మా" అంటమాత్రం బతుకతుందంట.

(నిష్క్రమింతురు.)

(ఒకనిమిషం నిశ్శబ్దంగావుండి, ఒకరిమొహం ఒకరు చూచుకుంటారు.)

కాంత :- సాధుసే—పలవరేగేడు. ఇక సర్కారు వుద్యోగస్థు లకు పోసుకతాగను వుప్పనీళ్లుకూడా దొరకవు. మనం తాత్సా రంచేసి లాభంలేదు. కర్తవ్యం నిర్ణయించాలి.

రంగా :- బొత్తిగా తాత్సారమే !! ఇందులో యెంతవరకు అతన్ని పట్టిచూడగలనో అంతవరకు పట్టిచూచి విడుస్తాను గాని మరియితరమా ? వాణ్ణి జైలుపాలుచేసి యిల్లూపిల్లికూడనూ వేలం వేయించి, శంకరగిరి మాన్యాలకు పట్టించకపోతే, ఇంకా నేనీ

ఫిర్కాలో వుద్యోగం చేసినట్టేనా! మునసబూ! అచ్చురిపోర్టు-బుక్కు పట్టుకరా. తాలూకా మేజస్ట్రేటుకు, పోలీసు సబినస్పెక్టరుకు తక్షణం వ్రాసి ప్రత్యేక నౌకరుచేత పంపుదాం. రేపు నేను స్వయంగా వెళ్లి తహశీల్దారుగారితో మాట్లాడివస్తాను. ఇప్పుడు టైమెంతైందో! నాకోటుజేబులో గడియారం చూడు లక్ష్మయ్యా!

లక్ష్మ:- మాటలసందడిన యెంతలో చీకటిపడ్డదండీ. (తన జేబులో అగ్గిపుల్ల వెలిగించి, చిలుకకొయ్యకువున్న కోటుజేబులోని గడియారంచూచి) యేడుగంటలైనదండి!

రంగా:- మీరు వేగిరం లాంతరులో కిరసనాయిల్ పోయించి పంపండి. రికార్డుపని చూచుకోవాలి.

కాంత:- లక్ష్మయ్యా! వంతుకోమటివాడెవడో కనుక్కొని, వారి బంట్రోతుకు అన్నం, లాంతరులో కిరసనాయిల్, వారి సువారానికి చీటి, రాసి సప్లయిచేయించు. బండి యెడ్లకు దాణా మరిచిపొయ్యేవుసుమీ! రెండు మానికెల వులవలు కొలిపించి కుమ్మరవాణ్ణి వుడకపెట్టుకొని రమ్మనిచెప్పు. నేను యెడ్లకు మేత కనుక్కుంటాను.

రంగా:- ఫస్టుక్లాసైన పంటపొగాకు-పాటి నేలది తెప్పించండి.

కాంత:- (వినయంతో) చిత్తం, చీటిలో పొగాకు అగ్గిపెట్టె గూడా రాయి లక్ష్మయ్యా!

రంగా:- చూడండి అక్కడ నాచెప్పులున్నవేమో?

లక్ష్మ:- (వెతుకుతూ) కొత్తజోడా యేమి కర్మం?

రంగా:- పాతజోడే, తెగిపోయినవే అనుకోండి. అయితే మటుకు, కాలిచెప్పులుపోతే యెట్లాగండీ? పొరపాటుపడి మీరే మైన తొడుక్కున్నారా?

లక్ష్మ:- ఇదొకసొడ్డా? అసలు నాకాలికి చెప్పులులేనిదే!! వీధివాకిట్లో విడిచివుంటారు, ఏ కుక్కో కాజేసివుంటుంది.

రంగా :- ఛీ, ఛీ! ఎంత దుర్దినమండీ! ఏదిచూచినా నిర్ధూమధామంగా వున్నదీరోజున.

లక్ష్మ :- ( ఎగిరిపడి దూకి ) కాంతయ్యగారూ! నాకాలికి యేదో మెత్తగా తగిలిందండీ!

కాంత :- (చూచి) బాగా కనుపించటంలేదు; ఏదోమెలికెలు మెలికలుగా వున్నదండీ!

రంగా :- (కుర్చీమీదినుంచే వంగిచూచి కాళ్లుపైకిలాక్కొని) జరిగిపోతున్నట్టుగావున్నదే! బాగాచూడవయ్యా మునసబూ! మరేమి ప్రాణభయంలేదులే! మీరుగూడా చూడండి కర్ణంగారూ! (కుర్చీమీదనే గొంతుక అనగా కాళ్లమీద కూర్చుంటాడు.)

లక్ష్మ :- అయ్యా! మీకుర్చీకిందనే జరజరలాడుతున్నదండీ! (వెనుకకు అంగవేస్తాడు)

రంగా :- ఏడవకపోయినావు! వెనక్కి నెడతా వెందుకు? ఎవరినైనా కర్రా, దీపము, పట్టుకరమ్మని కేకవెయ్యి; వెధవ వంగినంగి మాటలూ నీవూను. (కంగారుతో లేచి ఆ కూర్చున్న కుర్చీమీదనే నిలుచుంటాడు.)

కాంత :- (పరకాయించి) లక్ష్మయ్యా! ఇంటికప్పులో అలికిడవుతున్న దేమిటోయ్? (మునసబు కరణాలు వాకిలివద్దకు వెళ్లుతారు)

రంగా :- వట్టి క్రియాశూన్యమైన మాటలేగాని, ఇంతలాంతలైనా తెప్పిద్దామనే ఆదుర్దావుంటేగా! కప్పు నా తల తగులుతూ వుండె. చస్తే ఆయనే చస్తాడులెమ్మని యెటు వీలుగావుంటె అటు సర్దుకోటానికి సిద్ధమౌతున్నారు. (నిలుచున్న కుర్చీమీదనే వంగొని వణకుతూ) వరేయ్, తలారిపోలా! ఏమేడుస్తున్నావురా వీధిలోను? ఈవిధంగా హడిలిపోయి అరచేతిలో ప్రాణాలుపెట్టుకొని మే

ముంటే వీధిలో కూనిరాగాలుతీస్తూ కూర్చున్నావు. ఇంకా రా వేమిటిరా, కర్రతీసుకొని...

లక్ష్మ :- నేను దాన్ని తొక్కినట్టు అనుమానంగా వున్నదండీ. ఉప్పుగల్లన్నా నోట్లోవేసుకొని చక్కానస్తాను. (వెళ్లిపోవును)

(తలారిపోలు ప్రవేశించి)

పోలు :- యేంది దొరా! అట్టా గావు కేక లేత్తవు! దాని జోలికి పోకపోతె మనల్ని యేంచేస్తది?

రంగా :- యేమి చేస్తుందా? కరచి చంపుతుంది. దానికి తెలివి లేదురా!

పోలు :- అంత పిడాటుగా చంపేద్దైతె నన్నుమాత్రం చంప దుటండీ! నాది పేణంకాదనుకున్నారా?

రంగా :- మిమ్మల్నిచూసె అవి భయపడతవిరా! పరకా యించిచూడమ్మా! పోలూ!

పోలు :- (చూస్తూ) అల్లదుగో! మాంకురిచీకి ఆనుకోని నల్లగా ముడుసుకోని, యేందో వుండదండీ! గాతకాడు నరుడేమి సేస్తడో అని మనకు నూరింతల బయంతో, వొదిగివొదిగివుండి, తప్పించుకపోదామని సూస్తావుంటదయ్యా!

రంగా :- ఓరి నీ వేదాంతం నల్ల కాడుగాను. అది విషజంతు వురా! దప్పున కొట్టిపారవెయ్యయ్యా!

పోలు :- నేను దగ్గిరకొస్తే తిడతరు కాదంటండీ?

రంగా :- ఇలాంటి సమయాల్లో జాతిభేదాల పట్టింపులు వుం డవులేవోయ్! త్వరగా కానియ్యమ్మా! తప్పించుక పోతుందేమో!

కాంత :- ఆ మాదిగముండాకొడుకును లోపలికొచ్చి బాత్తి గా మనలను ఆనుకోమంటున్నారు. ఇట్లా సందిస్తే రేపు వాడు మన నట్టింట్లో కే వచ్చి కూర్చుంటాడు. ఇదెక్కడి ధర్మమండీ!

రంగా :- ఇది ఆపద్ధర్మమయ్యా! అడ్డుచెప్పబోకు. అమ్మ

పెట్టా పెట్టదు- అడుక్కు-తినా నివ్వడు. అడ్డమాటలు చెప్పబోకయ్యా, నీపుణ్యం!

కాంత :- అరవబోకండీ! మీగోల విని పగపడుతుందేమోను.

రంగా :- నిజమేసుమీ! ఎంత పొరబడ్డాను పారబ్ధం! నాకు మతిపోతున్నదండీ! పొద్దున్నే యేపాడుమొహం చూచానో గ్రహచారం!! ఏదిబట్టినా కొరవితీసుకొని తలగోక్కు-న్నట్లున్నది.

(లాంతరుతో లక్ష్మయ్య ప్రవేశించును.)

పోలు :- (కర్రపూనిచూచి) అదిమాకర్ణంగారి దత్త్రానికి కట్టిన తాడండీ! అదుగో కాయితాలమీద కప్ప యెగురుతా వుండది. అదీ నప్పిడి.

కాంత :- ఇక దయచేసి కూర్చోండిసార్!

లక్ష్మ :- (ముసి ముసి నవ్వులు నవ్వుతాడు)

రంగా :- (కూర్చొని) మరి పైయలికిడేమిటో?

పోలు :- అయిగో! గబ్బిలాలు, సందెనీకట్లో రెపరెప లాడతా వుండాయిదొరా!

రంగా :- ఛీ, ఛీ! దరిద్రపుదయ్యాలకొంప, ఏనాడైనా దీపమూ ధూపమూ! నేను వరుండటానికి మీయిండ్లల్లో యెక్కడైనా యేర్పాటుచెయ్యండి. కర్ణంగారూ! భోజనం మీయింట్లోనే కాబట్టి రికార్డుపని అక్కడే చూచుకోవచ్చును పదండి.—

(తెర)

# మూడవ అంకము

## రంగము—౧

ప్రదేశము:— గ్రామములో ఒక వీధి.

ప్రవేశము:- ఒకవైపునుంచి నెమ్మదిగా మహమద్‌ఖాన్ సాహెబు, రెండవవైపునుంచి లక్ష్మయ్య త్వరత్వరగా.

**మహ**:- ఏక్కిడాఅండీ, లచ్చిమ్మగారూ! జల్దీ జల్దీ, బల్ హుషార్ మీాంద పోతావుండారే?

**లక్ష్మ**:- గ్రామంలో సాటింపు చేయించాముగా నీకు తెలియలేదా? మన కర్ణంకాంతయ్యగారి కుమార్డు బారిష్టర్ నారాయణరావుగారు వస్తున్నారు. ఆయనకోసం పెద్దసభ జరుపుతారు. ఆసందర్భంలో తోరణాలు కట్టించటం, ఆర్చీలు పాతించటం, స్వాగతపద్యాలు రాయించటం,— ఇదేమిటి అదేమిటి -సభాసన్నాహమంతా నా నెత్తిమీాద పడ్డది. అది నెరవేర్చిందాకా నాకు నిద్రపట్టదు.

**మహ**:- "పెద్దాభసా" వుంటె పెద్దా "జెల్సా" చేశారూ అన్నమాటే! వ్రెట్టీ టీసీళ్ళూ కమ్నాకీ కోటా్కటమేనా? భోగమోాళ్లకి పిల్పించి ముద్దుల్‌కి తిన్పించి, ఖుషీచేస్తారూ, లేదూ? "పండ్గా" అంటే పిల్లోండ్లకీ పెద్దోండ్లకి, మల్లీ కమ్నాకీ కంటీకి ఖుషీ చేపిచ్చాలగా అండీ!!

**లక్ష్మ**:- అయిదు వందల రూపాయల కార్యక్రమమైతే! బోగమాళ్లులేక భాగోతాలులేక వూరికెనే వుందనుకున్నావా?

**మహ**:- "నారాణ్‌రావూ" అంటే--మనకర్నం బడాభేటా కదూ అండీ!

**లక్ష్మ**:- ఆ.

**మహ**:- మన వెంకాలుగారి కొడూ్క రాముల్‌తో కలీస

కుంటీపాత్రీ బడీమే పద్వ్యాకుంటూ హాల్లరీచేసే బచ్చాకదూ అండీ?

**లక్ష్మి** :- ఆ-అప్పుడు రాములతో కలిసి అల్లరిచేశాడు, ఇప్పుడు రాముల్నే అల్లరిచేశాడు. రాముల సంసారం తీన్ తేన్ అయి పాయెగా! అబ్బా కొడుకు కలిసి వాండ్లకు నిలవనీడలేకుండా చేశారు. పాపం బెజవాడకు లేచివెళ్లాలె అనుకుంటున్నారు.

**మహా** :- అప్పుడ్వ్యాక్కా తల్లిపిల్లల్ లాగ వుండి, హిప్పుడ్కీ యెంతహాన్నేలానీకి నచ్చాడూ అండీ! సీమాలో సద్వేవాడు రాముల్ కీ యేట్టిచేశాడూ అండీ?

**లక్ష్మి** :- సీమనుంచివచ్చి మద్రాసులో బల్లకట్టి రెండేండ్లు దాటింది. (రహస్యంగా) మనసులో వుంచుకో! వెంకయ్యబాకీకి పున్నిశెట్టిచేత మన కర్ణంగారు దావాపడేయించటం, తానేకర్మ ధర్మం ఎరగనట్టుగానేవుండి మళ్లీ రాముల్ని దగ్గరకుతీసుకొని వాండ్లచేత అన్సరుపడేయించటం, క్రిందికోర్టువారు ప్రతివాదులు యిచ్చేమని చెప్పిన చెల్లులు వాస్తవమైనవని నమ్మి తీర్పుచెప్పటం, అది హైకోర్టుకు అప్పీలుకు యెక్కటం నీవు విన్నావుగా? హైకోర్టులో కాంతయ్య తనకుమారుడికే వకాల్తుయిప్పించాడు పున్నయ్యచేత.

మహా :- నారణ రావు యేవరాకారం వ్రెప్పున్నాడూఅండీ రాముల్ మీాంద?

లక్ష్మి :- నీవు వట్టి పిచ్చివాడివిసుమా! డబ్బువస్తూవున్నప్పుడుకూడా ధర్మాన్ని పాటించేవా డెంతవాడు కావాలి? పాపం నిజానికేమి? కాంతయ్యభార్య, కోడలు యీపనికి పూనవద్దని చాలా చెప్పిచూచారట.

మహా :- భారాగారి మాటకూడా [illegible] అండీ [illegible] రావు?

లక్ష్మి :- "నా [illegible] దీనికి [illegible] చెప్పకండి" అన్నారట. [illegible] హైకోర్టులో [illegible] క్రిందికోర్టువారు [illegible]

నమ్మిన చెల్లులు హైకోర్టువారు నమ్మకపోవటం, పున్నయ్యమాట నెగ్గటం, జరిగింది ఇప్పుడు పున్నయ్యపొందిన డిక్రీని అమలు జరిపి వెంకయ్య కుటుంబాన్ని యింట్లోనుంచి లేవగొట్టి కొంపాగోడీ స్వాధీనపర్చుకున్నారు.

మహ :- అయితే! బిజ్వాడాకీ యేమ్టికీ యెల్లాలి? యెగ సాహెం వుందిగా.

లక్ష్మి :- వల్లకాదూ, నల్లమనుగూ వున్నది. సొంతభూమి బాకీలకిక్రింద పోయింది. కవులుభూమి శంభుశాస్త్రి యితరతాఁ యిచ్చివేశాడు. పశువులు వగైరా చరాస్తి, సర్కారుబాకీలక్రింద జప్తులు వేలాలూ కాగా, యేకొద్దిగానో వుంటే, అది చిల్లరబాకీల క్రింద చెల్లయింది. ఇదంతా (రహస్యంగా) మనకర్ణంగారి చలవే!!

మహ :- కర్ణంగాడూ! కిందీఖోరట్ మే రామాల్ పచ్చాం వుండాడుగా. మల్లి హైఖోరట్ మే ఖోంటీవాడికి చేత పట్టేడూ? నాకీసూస్తే — యీనాకీ రొండూతల్ కాయల్ సిఖండీలాగా వుం డాడూ అండీ! అటూ యిటూ తింటావుండాక్. సూత్ ! యేకీ నిజం—యేదీ అవ్వునిజం? యీపరాకారం చేస్తావుంటే యే నాబోటి యే తల్ తిక్కాగోడో బిస్మిల్లాచేస్తాడు, సూడండీమల్లీ!

లక్ష్మి:- రెండుతలల పాము బహు మొండిది సాయిబూ! బిస్మిల్లా చెయ్యటానికి యెవరెంత చంపినా అది చచ్చేదికాదు.

మహ :- అరేతోబా! ఇన్నికట్టిల్ మే వక్కా జిల్లెక్ కట్టి వుండదూఅండీ! దాంతో అదీ డుబ్ గయా. మొదట యెంక ఆ గారు రాజీఖోసం, ఆయన కాళ్లకీ యేళ్లాకీ పడ్డాడుగా! పాపం బడా అద్మి! ఆయనాకి వక్కాతిప్పల్ పెట్టేడూ? పున్నాయ్ కీ హుషార్ చేసీ యాజ్జం యేపిచ్చాడు. యంకా ఆకి పీడర్ కుదిర్ పిచ్చీ అన్ సర్ పెట్టించాడు. రెండూ మనుసుల్ కాడా డబ్బాలాగేడు. మల్లీ పున్నాయ్ కి బోల్తాకొట్టించి, యెంకాఆకి యేట్లోదింపి యేశాడు. యేంమ్టిబతూక్కాఅండీ లుచ్చాబతుక్కా! ఇస్మంటి

వాళ్లూ కన్యాకానే బ్రాహ్మన్ జాతికి తెరమీందికి యెక్కించి బొమ్మా కట్టి ఆడింపిస్తావుండారు.

లక్ష్మి:- నీ వన్నట్టు యీ ప్రయివేటువృత్తిలోవాండ్లదగ్గిర యెన్ని గుంటచిక్కులైనా వున్నవి. కాని తెరమీందికి యెక్కటానికి యిదే కారణమైతే సంతోషమే. నిజంగా ఆలోచిస్తే, బ్రాహ్మలు లోకువజాతులవాండ్ల కొంపలు తగులపెట్టలేదు. పెండ్లాలు విడిచిపారేసిన చీరలు మడతలుపెట్టటంలేదు. భార్యలకు తలలుదువ్వి, జడలువెయ్యటంలేదు. సానికొంపల్లో మార్వాడీలకు, యితర విటులకు మంచాలు వాల్చటంలేదు. ఒకవేళ అట్లాంటివాండ్లు వుంటే అన్నికులాల్లో వుండవచ్చు. మొత్తానికి, యీ నీచమైన ప్రైవేటువృత్తి వాండ్లు మానుకోతగినవి. బోడితలలకు బట్టతలలకు ముళ్లుపెట్టే యీ దురాచారాన్ని నిర్మూలించటానికి యెంతపనైనా చెయ్యవచ్చు.

**మహ**:- అదీ యేమీ మాటాలెండి మహారాజ్! యీ పర్‌వేటుకామ్, వక్క బ్రాహ్మన్‌గాడు చేస్తావుండాడూ యేం? ఆ నామర్దాకాం చేసే బద్మాష్ యెవడూ అయినా ఖత్ల్ చెయ్యాలె అనండి.

**లక్ష్మి**:- (మెల్లిగా) గోడలకు చెవులుంటవి. మన సంభాషణ కాంతయ్యగారికి తెలిసిందీ అంటే మన పనిగూడా ఇల్లాదేబిల్లా చేశాడన్నమాటే! "ఉడుముకేలరా వూళ్లోవార్త" అన్నట్టు మనకెందుకు సాయిబూ! మనమూ, అప్పులతో తల మునకల్లోపడి కొట్టుకుంటున్నాము.

**మహ**:- (రహస్యంగా) ఆయన మొఖం, యింకేం చేస్తాడూ లెండి. అబ్బాయిగారి బేరిష్టర్ సద్యాకీ అయ్ని అప్పల్ జజ్ మీంద వొచ్చి కూకుంటాడైగా! యెంతా కాళ్లాబేరం చేస్తావుండాడూ వాండ్లతో? అసల్ అన్నంతింటావుండాడూ?

లక్ష్మి :- చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా! "చెరవ కురా చెడేవ్" అన్నారు. అనుభవించక తప్పుతుందా? ఇందులో ఇంకొక రహస్యం, అక్రిమణ కేసులు కమ్మీ్మాపెట్టినందుకు అర్జీలు పడినవి. అది యేలువాచి రోతైంది. గోదావరీస్నానం చేసివస్తా డనుకుంటున్నారు.

మహ :- అయితే దానికీ మొఖద్దమా జర్గుతావుండాది? అచ్ఛా! అచ్ఛా!! మద్దెంలో యీపున్ని సెట్టీగాడీది బల్ జబర్ దస్తీ అయిందీఅండీ! ఆడీకి మేం బాకీవుంటె పిట్టన్ నీళ్లు తాగ నియ్యడూ——భాయ్!

లక్ష్మి :- అదీ అంతు తేలిందిలే! వెంకయ్యాయిల్లు తనలోగిట్లో కలుపుకున్న తరువాత, బలేనష్టం కలిగింది. అటు ప్రాణహాని, యిటు ధనహాని కలిగి నెత్తి అణుచుకపోయిందిగా! ఇక గుగ్గిళ్లబుట్ట నెత్తికి వచ్చిందన్నమాటే!

మహ:- షెబాష్! అచ్ఛాబాత్ బోలో ఫ్రాయ్! పావం మొంకాఆగారూ, ఆయన పంపారంచూస్తే, నాగుండెల్ ధడ్ ధడ్ కొట్కుంటాయండీ! దేఖో, లక్ష్మాఆ హాజరత్! యేక్ గాంమే అంత దర్జాబతూక్ బత్కి, బడాఅద్మీ అన్పించుకొన్న మొంకా ఆగారూ "అల్లాహో" అని యేడుస్తా పుట్టీపెర్గిన గాం ఛ్ఛెవిలి, ఆ బజార్నె మెల్లావుండటం—— ఈబజార్ మే కర్నం ఆయన ఖేటా పెంషేర్ గా మోటార్ మీంద భైటాయించి, మీసాల్ గీట్కుంటా, నౌబోత్ తాషా బేండు భోగంమేళంతో, వృత్తావంచేస్కుంటా ఫెచ్చి తఖ్తు యెక్కటం? యెస్మంటీకాలం వచ్చిందీ అండీ!

లక్ష్మి :- ఎప్పటికి యేప్రాణికి యేవిధంగా జరగవలెనని చేటలో పడేటప్పుడు వ్రాసివున్నదో, ఆవిధంగా జరిగితీరుతుంది. తప్పించ టానికి యెవరివశం? చాలా పనివున్నది. ఇక వెళ్లుదాము, రా.

మహ :- ఇస్మంటీ యేదాంతం పెట్కునే దేశం గులాంగిరికి తయ్యారయిందిలెండి. జాయింగావు.

# రంగము— ౨

## ప్రదేశము:— పశువులపాక

తెర యెత్తగా—వెంకయ్య, మంగమ్మ కనుపింతురు.

[ పాకలో దడికట్టబడి వుంటుంది. దాని ప్రక్కన ఒక కుక్కిమంచము వాల్చబడవుంటుంది ఆ మంచానికి ఆనుకొని, ఒక గడ్డికుదురుమీద ముసలి యెద్దుకు యెదురుగా వెంకయ్య కూర్చొని, మోకాళ్లమీద చేతులు పెట్టుకొని దండంపెట్టినట్టు పైన కలిపి, తల వంచుకొని, దగ్గుతో ఆయాసపడుతుంటాడు. ఒంటిమీద వస్త్రువులుండవు. ప్రాతవి ముతకబట్టలు ధరించి వుంటాడు మంగమ్మకు కూడా బీదతనం తెలియజేసే సొమ్ములు, గుడ్డలు వుంటవి. ]

మంగ:- నిన్న మద్దినాళంగా రొండు మెతుకులు నంజితివి. మళ్లీ నోరు తెరచి, గచ్చిగంజ మింగకపోతివి. గొడ్లను యిడిచేయేళ అయిందే! యెందాకుంటావిట్లా? రెండు రొట్టెలు తెస్తా; తిను.

వెంక:- నాకాకలిలేదే! (దగ్గు) కడుపులోనే... యేందో... పుస్కగుండు పడినట్టున్నది .. పేగాలనే, గొంతులోకొచ్చి గుంజకపోతున్నట్టున్నది .. తలకాయలో గడ్డపలుగు తీసుకొని కుమ్మినట్టున్నది.

మంగ:- నిన్నటినుంచి బువ్వ లేకపోవటాన అట్టా వుందిలే! మొంటుమిరపకాయలు నిప్పుల్లో కాల్చి తెచ్చి, గుల్లివాయేసి కారం కొట్టుకొచ్చినాను. కమ్మటి వాసన వొస్తున్నది. దాంట్లో వొకముద్దతింటే, బాగ తమాయించుకుంటుంది. తెవాలో బువ్వేసుకొచ్చేది ?

వెంక:- "బువ్వా" అంటే బొడ్డుకాడ్నుంచి తెములుకొని తెములుకొని .....గుండెల్లోంచి పోస్తుంటే, యెట్టాతినేది? (ఆయాసము)

మంగ:- తినకపోతే శోషొచ్చి పడిపోతావు. ఉడుకుడుకు బువ్వుందిలే, తెచ్చేది ?

వెంక:- (వెర్రిచూపుతో) అయితే... బువ్వన్నఅంటావా ?

మంగ:- ఆ...... ఇప్పుడే వొండితినే !

వెంక :- (కండ్లవెంట నీరుకారుస్తూ) మనకింక బువ్వాలేదే !

మంగ :- వున్నది. నిన్న పిల్లోడు తెచ్చిన వరిగెలు దంచి వుంచితిగా !

వెంక :- (వికారపు నవ్వుతో) బువ్వ లేదు ; లేదు.

మంగ :- (ఎలాకపోయి) యిదేందమ్మా యిట్టా మాట్లాడు తాడు. జరతొందరమాటలేమో ! ఇదుగో... అట్టా యెర్రి చూపు చూస్తావేం ?...... నే నెవరిని ? ...... యేందమ్మా జవాబుచెప్పడు ? తంబళ్ల శివయ్య నడిగి వంటకలికెం తెచ్చి యేసేదా ? ఆ నారాయణమూర్తి యెంతలో మాకీ కష్టాలు తెచ్చిపెట్టేడు ! ఏం .. .. పలకవేం ? ఎట్టావుంది ?

వెంక :- బాగానేవుంది. ఎందుకట్టా తొక్కులాడుతావు ? నే నేమన్నాను ?

మంగ :- బువ్వ లేదంటావే ?

వెంక :- అందుకేనా, మందులంటావు, మాకులంటావు. తెచ్చేదానివి పాణాలు యెళ్లిపొయ్యేమందు తెచ్చిస్తే నీకు పుణ్యముంటుంది.

మంగ :- (కండ్లనీరు తుడుచుకుంటూ) ఇదుగో ! ఇట్టాంటి మాట లనబాకా !— నే నినలేను. యేదివున్నా యేదిపోయినా పసుపు కుంకుమా వుంది; ఆ పక్కనలుసు చల్లగావున్నాడు, అంతే చాలు ననుకుంటే— ఇట్టాంటిమాట లంటావూ నీవు ?

వెంక :- అనక యేంచేసేది ?... అంటానుగాని .. అన్నట్టు జరిగించుకోలేనుగా ! ఇశ్శోబ్బా ! (ఆయాసము) యేమిబాధ నాయనా ! లోపల నిప్పుల చెరువున్నదేమో !

మంగ :- (వెంకయ్య ఒళ్లు పట్టిచూచి) ఒళ్లు బాగానేవుందే. యీ రోగం యట్టా కుదురుతుందబ్బా !

వెంక :- పిచ్చికళ్లాలవే ! రోగం కుదిరించనే కుదిరించారు.

మంగ :- నీవా దిగులు పెట్టుకోని, అన్నానికి నిద్రకూ వైతొలిగి మంచంపట్టి, మా కాళ్లూ చేతులు యిరగతొక్కుతావు?

(ప్రవేశము :- చొప్పమోపుతో రాములు)

వెంక :- నాయనా, రాములూ! దొడ్లెంట బిచ్చానికి బయలు దేరినా మోపెడు మెత్తనిగడ్డి ముసిలెద్దుకు చిక్కకపాయెగా! కొత్తవామి యేసినదాకా, పాతవామి సీలకట్టదుయ్యానిరోజులు పోయి ఫ్రాయ్ భగవంతుడా! గడ్డిపాచలకు యెన్ని తిప్పలొచ్చి నవి తండ్రి!

మంగ- ఈ ముసలి బసవన్న అప్పాలోండ్లకు యెక్కస మైనట్లు మనకు గూడా యెక్కసమైతే యెట్లా?

రాము :- వాండ్లకెక్కసం కావటం మంచిదే అనుకుంటు న్నానమ్మా! ఇంత కఠినంచేసి మనక్కీగతి పట్టించినోండ్లు యే తప్పుడుపని కెరుస్తారు? ముసలిఎద్దుకు యేమాదిగవాడికో నాలుగు రూపాయలకు కొయ్యపెట్టరని యేఃమినమ్మకమమ్మా! ఆ మాట చెవుల పడితే మనపని యింకా యెట్లాపుండేదో?

మంగ :-(చెవులుమూసికొని) అబ్బా! నీవా మాట అంటుం టేనే నా పాణా లెక్కడికో లేచిపోయినయిరా! నీవూ అది వక్క యీడువాండ్లు. చిన్నప్పుడు పాలుచాలక నీవు పోరుపెడుతుంటె దానెమ్మపాలు తీసి నీకు పొస్తానన్నాను. మీయయ్య పాణం వొప్పక, గొల్లనాంచేరి చేత నీకు పాలిప్పించి దానికి జోడుకోకలు నేయించిపెట్టినాడు. నీకంటె కూడా యెక్కువ ఆపేక్షగా చూచు కునేవాడు మీయయ్య.

వెంక :- చూచుకున్నందుకు మనరుణం యేమైనా వుంచు కున్నదా? మన పెద్దకొడ్డుకై యిరవై రెండు దుక్కులు దున్నిపెట్టింది. ముల్లుపోటు తగలనిచ్చి యెరుగునా? పండ్లూడిపోయిన పండు ముసల్దిగదా! దాపలదున్నిందో— యెలపట దున్నిందో యెవ రికైనా చెప్పమను చూతాం.

రాము:- అయ్యో! ఈ యెద్దు రాతిబండ్లీడ్చిందిటే!

వెంక:- ఈడ్చింది! రాతిబండికి చొప్పతో వేసి వాగుమీద వదిలిపెడితే పరిదానిమీద వుండాలిసిందేగా! యెట్టాంటి మెద గాల్లోఅయినా సరే మోకాటితండేసి అమాంతం బండి పెళ్లగించేది గాని తల్లేరు కాడి కట్టి యెరుగుదునా? అట్టాంటి బసవన్న ఇప్పుడు మన సంసారంలో యెత్తులేక తాను యెత్తుపడ్డాడు. ఆ యెద్దును కీగంటచూస్తే మనం పురుగులగ తేగాని యితరమూ? మనకు వేళకు తింటానికి దొరికింది దొరికినట్టు దాని ముందర పెట్టి మనం పస్తు పడుకుందాము.

రాము:- ఈ వూళ్లోవుంటే అట్టాగే చెయ్యొచ్చు. బెజవాడకు పోవాలె అనుకుంటిమిగా మరి. ఎట్టా దీన్ని కదిలించుకు పొయ్యేది?

వెంక:- (గాద్గదికంగా) నా కిప్పుడు పట్టుకున్న దిగు లదే రాములూ!

మంగ:- అందరూ కలికాలం ప్రాణాలా? యెవరైన మంచి సంసారికిస్తే మేపరూ?

రాము:- కాలం యీ విధంగా వున్నది. యెవరు మేపుతారు? జాలిపేగులవాడు కోటయ్య. గబగబా అనుస్తాడన్న మాటే గాని అల్పంలేనివాడు. ఆయన్నడిగితే సరే నంటాడేమో!

(ప్రవేశం:- కోటయ్య)

మంగ:- అదుగో అనుకుంటుండంగానే వచ్చాడు కోటయ్య. నూరేండ్లాయుస్సు.

కోట:- యెందుకమ్మా అంత ఆయుస్సు? మీయంటోండ్ల కష్టాలు కండ్ల చూట్టానికేకదూ! చూచి తోడుపడటం చేతగాక చేతులు ముడుచుకొని చచ్చినట్టు పడివుండటానికేకదూ!

మంగ:- అంతమాట యెందుకనుకుంటావు నాయనా?

పాపం నీ వేమిచేస్తావు? ఇదేమైనా నెత్తిమీది బరువా, నలుగురు కలిసి దింపేటందుకు!

కోట:- యెంకయ్య కళ్లల్లో పేణాలుపెట్టుకొని వున్నాడు. బువ్వ తిన్నాడు?

రాము:- నిన్న మద్దేన్నమనంగా రెండుమెతుకులు బలవంతంమీద కొరికిచ్చాము. మళ్ళీ పచ్చిగంగ యెరుగడు.

కోట:- మెతుకు తినక వుగ్గవట్టి చేసే దేముందయ్యా? అంతో యింతో యెంగిలిపడకపోతే చేతికి రావు. మా యింట్లో యేడియేడిబువ్వ వుంది; తెచ్చిపెడతాను తినవే!

వెంక:- వద్దు, వద్దు, సయించదు.

కోట:- జరంగనక తగిలిందేమో! ఆసుపత్రికి తీసుకపోతే బాగుంటును.

రాము:- "ధర్మాసుపత్రి" అని పేరేగాని, అక్కడగూడా భాగ్గెమంతులకె మంచిమందు లిస్తారు. పేదోళ్లకు వట్టి నీళ్లు!

మంగ:- యెవరికైతే మాత్రం — మహావ్యాధికి మందేముంటుందిలే!

కోట:- అదురుపెట్టుకోబాకు యెంకయ్యా! "వొడలు బండ్లు — బండ్లు వొడలు" అయితయంటారు. రెక్కలు చల్లగావుంటే మళ్లీ పరువుగానే బతుకుతావులేవే!

రాము:- ముందుమాటలతో పనేముంది కోటయ్యా! రాజెవరో రెడ్డెవరో తెలియదు. ఇప్పుడు పాణాలుపోక కొట్టుకలాడుతున్నాము. "ఇక యీ వూళ్లోవుండి నలుగురి మొగాలు చూడలేనో" అని మా అయ్య, — "వూరొదిలిపెట్టి పోవటానికి నాకు కాళ్లురావు" అని మా అమ్మ. ఏమిచెయ్యటానికి పాలుపోక కంటికి కడివెడుగా యేడుస్తున్నాము.

కోట:- మీ సంగతి చూస్తే నా పేగులు తరుక్కుపోతున్నాయి. మరెక్కడికీ పోవొద్దు. నా రెండరకల పొలంలో ఒక అరకపొలం, మొద్దు యేరకలప సామానూ సంతోసంగా యిస్తా. మా మొద్దుల కొట్టంలో కాపురం పెట్టుకుందురుగాని నాతో లేచి రాండే, పోదాము.

వెంక:- పూలమ్మిన బజాన, కట్టెలమ్మలేనురా కోటయ్యా. నీమాట వినలేదని కోపగించుకోబాక.

మంగ:- నీకు మామీద దయవుంటె, వక్కపనిచేసిపెట్టు కోటయ్యా! ఆయన పాణం సంతోసిచ్చుతుంది.

కోట:- అమ్మా! నీకంటే అనేకం చిన్నవొణ్ణి, నన్ను పార్దివపడాలెనా? యేమిటో చెప్పు. నెత్తినపెట్టుకొని చేస్తా.

మంగ:- అదుగో! ఆ ముసలెద్దు వక్కటి మిగిలింది. దాని దిగులు ఆయన్ను బాధిస్తున్నది. దాన్ని నీవు పట్టుకపోయి సుకంగా మేపుతానంటే, ఆయన నోటికి మెతుకు పోతుంది.

కోట:- ఇంతేకదా! కుశాలుగా తోలుకపోయి దాని కడుపులో నిదర్పోతాను. అసలు మనం పుట్టిందెందుకమ్మా?

వెంక:- (దుఃఖముతో, గాద్గదికంగా) ఆసాంతానికి తేలిన మాట చెపుతాను వినరా కోటయ్యా! నన్ను నా చుట్టాలు పక్కాలు విడిచిపెట్టినా, మొక్కులు మొక్కించుకున్న, ధాన్యలక్షుమ్మ భూలక్షుమ్మలు నన్ను విడిచిపెట్టినా, నాసాటివాళ్లందరూ నన్ను విడిచిపెట్టినా, తాను పుట్టినకాడనుంచి నన్ను యేమారకుండా, తన నెత్తురు నాకు దారపోసి, నేను బాగాతింటే తాను తిని బలిసి, నేను పస్తుపడుకుంటే తాను పండుకొని యెండి వరుగై, నామీదనే తన పాణాలు నిలుపుకొనివున్న యీ ముసలి బసవన్నను- గతిలేక- మతిలేక- సిగ్గులేక- కటికవాణ్ణై- నీవు సాటి

పండంటి రైతువుకాబట్టి, నీకు దీన్ని చేతులార వప్పచెప్పి పోతున్నాను. యీ పాపానికి యిరుగుడు వుంటుందబ్బా! మరే యిక నాకు ముందుగతు లుండవు. దీనికంటే యీ రోజుకు నాకు అభిమానమే యెక్కువగా కనపడ్డది. రాములూ! యెద్దుది కట్టు గుంజ పలుపు వూడతియ్యి!

రాము :- (లోపలికివెళ్లి తెచ్చి గుంజ పలుపు తండ్రి కందిచ్చును.)

వెంక :- ఇదుగో, కోటయ్యా! నా బంగారపుకొండ — నా పాణం — నీ చేతులో పెడుతున్నా. తోలుకపో. పాపపుణ్యాలు నీవే!

మంగమ్మ, రాములు :- (కండ్లనీళ్లతో దుఃఖిస్తారు.)

వెంక :- (కోటయ్యకు పలుపు పట్టిస్తాడు)

కోట :- (పలుపు పట్టుకొని వెళ్లిపోతాడు)

వెంక :- (పలుపు పట్టిచ్చిన చేతులు, పట్టిచ్చినట్లు అల్లాగే వుండిపోతవి. వికారమైన చూపు చూచి రెండుకండ్లూ మూసుకుంటాడు. వెనుకకు తూలి పడిపోతుండగా, రాములు మంగమ్మ పట్టుకుంటారు. కొంచెంసేపటికి తెలివితెచ్చుకొని, హీనస్వరముతో) రాములూ...... నన్ను...... నన్ను... మంచంకాడికి తీసుకపో అయ్యా!

రాము :- (మెల్లగా నడిపిస్తుంటాడు)

వెంక :- దేముడు ..... వున్నాడబ్బా!!!

మంగ :- (ఆదుర్దాగా) ఇదుగో! కండ్లు తెరూం? దేముడు మన గుళ్లో వున్నాడుగా!!

వెంక :- అంతేనా... అంతేనా... ఇంకెక్కడా లేడూ?

(తెర, మాంద్యంగా)

# రంగము—3

ప్రదేశము :— గ్రామవీధి

ప్రవేశము :— పున్నిశెట్టి.

( వళానము నుంచి బుజానవేసుకొని, నెత్తిమీద గుగ్గిళ్లబుట్టతో.)

పున్ని - (పెద్దగొంతుతో) పప్పూ, బెల్లం, అగ్గిపెట్టెలు, పొగాకు, గుగ్గిళ్లూ !! సాక, కారుసాక :—

(ప్రవేశం.- నారాయణరావు, విదేశమస్తులతో.)

నారా :- ( చిరునవ్వుతో ) ఏమోయ్, సావుకారూ, అంతా క్షేమమా ?

పున్ని :- ( వెకలినవ్వుతో ) దండాలు, దండాలు; యేదో పనిమీద బయల్దెల్లినారే ?

నారా :- పనేమున్నది ? చల్లగాలి పీల్చుకోవచ్చునని పొలాల కేసి బయల్దేరేను. నీవు ప్రతిసరినోట్లు కట్టలు పోయి పచారీదను సులమూట బుజమెక్కిందేమి ?

పున్ని :- (దీనంగా) యేముండది నాయనా! ఆ మునసబ్బు వెంకయ్య బాకీకింద, మీ అబ్బాయిగారికి లిద్దరు, అతని పొలం బొందా, కొంపానోకీ, వేమంటూ యిప్పించారో (సాగుడుగా) యెగసాయంలో నష్టమైపాయె .. యాపారంలో నష్టమైపాయె. ఆపాటింట్లోకి యేమంటూ కాలుపెట్టేమో— నెలతిరక్కతలికి మా యింటిదీ పాయె—యిద్దరు పిల్లలూ పోయిరి. వొక్కబాకీ వసూలైతే వొట్టు. యాడి దాడనె సరి. యేలుపెట్టినసోటల్లా సిలా నదిలో సెయిమంచినట్టయింది.

నారా :- ( ఆశ్చర్యంగా ) అరెరే! పాపం, చాలా అన్యాయం జరిగిందే ?

పున్ని :- ( మూటా, బుట్టా దింపుకొని కూర్చుంటాడు) పంతులుగారూ ! కూచోండి. వుడుకుడుకు పప్పుండై తిందురుగాని.

ఆమైన అక్కడనుంచి యేమైనదంటే :- పెద్దకొంప- మిద్దెకొంప- సరుకు సట్రా పెట్టుకోటానికి యిమ్మగా వుంటదని, ఆశపడితే, కొత్తనీళ్లొచ్చి పాతనీళ్లు కొట్టుకపాయె. అయ్యో! అట్టాగే నిలుసుం డారే! నేనేమో కూసుంటిని. ఆమైన గద్దె కోటణ్ణి సోదెడుగుతే అది దయ్యాలకొంప— పాడుపెట్టమనె. సివమాడపోయి సోటుపోగొట్టుకుంటి. సివరికి సిప్పసేతికొచ్చింది.

నారా:- వెనుకటికి యెవరో అన్నట్టు- కోమటోడివిగనుక కొంత నయములే! అయితే వెంకయ్యా వాండ్లు యిప్పు డెక్కడ వుంటున్నారు ?

పున్ని :- వాండ్లకేమయ్యా బెజవాడసేరుకొని దిమ్మిరంగా వున్నారు.

నారా:- (ఆలోచనతో తలవూపి) కోదుకు రాములెక్కడ వున్నాడు? అతను నేను చిన్నతనంలో బజారుదుమ్ము వంటినిండా అంటుకునేటట్టు ఆడుకునేవాండ్లము.

పున్ని:- నిజమేనండీ! నీ కెక్కడ గేపకముందంట! వూరంతా వుక్కకొలిక్కి తెచ్చేవాండ్లుకదూ !

నారా :- మేకల గుంపులు వస్తూంటే వాటినిపట్టి పాలుపిండు కొని తాగేవాండ్లము.

పున్ని :- వక టేమిటిలెండి. యెన్ని సెయ్యాల్నో అన్నీ సేసేరు. వకపాలి యీడ నేను కాలుమడుసుకుంటుంటె, యెను గ్గుండా వొచ్చి బోళ్లసెట్టి వురకలే ?

నారా :- అప్పు డిక్కడొక వీధిబడి వుండేది. పాపం పంతుల్ని మహా యేడిపించేవాండ్లము. ఆ కుంటిపంతులు కొట్టటానికి లేచే సరికి, పరుగెత్తి రాములయింట్లో ప్రత్తిమండెలో మేము దాక్కొని పైన ప్రత్తి కప్పుకునేవాండ్లము.

పున్ని :- ఆ, ఆ. అబ్బరంగా పుట్టినోండ్లెలిరి. అందుకని యే ఆట ఆడినా సాగేది. యిద్దరూ వకతల్లి పిల్లలాలె వుండేవాండ్లు కదూ !

నారా :- ( పాదచ్ఛాయలు వేస్తూ ) అయితే ! రాము లెక్కడవున్నాడు ?

పున్ని : బెజవాడకు లేచిపోయినా రంటినే !

నారా:- మరి సేద్యమో ?

పున్ని :- సేద్దెం పూజ్జెమైంది.

నారా:- ( ఉలికిపడి ) మనమూలాన యేమీ ఆధారం లేకుండా పోయిందన్నమాట తినటానికి.

పున్ని:- వురుపీడేమి బుజుగున్నది లెండి మెనక మాత్రిం !

నారా :- అయ్యో ! లేకేమి ? సంపన్న గృహస్థులు కదు టోయి ? (నాలుగడుగులు నడిచి ప్రిక్కకుచూచి) ఆపాడుపడిన యిల్లు, ఆ పడిపోయిన పశువులపాకలు, ఆయావులదొడ్డి వెంకయ్య వేకదూ ?

పున్ని :- ఆ, ఆ, అదే మారికోంప ; నా మచ్చమాపింది.

నారా :- (కరుణంగా ఆవైపే చూస్తూనిలబడుతాడు)

పున్ని :- (లేచి నవ్వుముఖంతో తలగీక్కుంటూ) ఇదుగో ! మన బార్యగారు నానుకోపులో చేరెందట, నిజమేనండీ? నీ మాట యంతమాత్రం యినదంట — యేకులరాటం మీద కూసోని పాటలు పాడుకుంటా పీపర్లు సదువుతుందంటా— యేమిటిదండీ యీ యిక్కలపన ? వురువు నిజమేనా అంట ? ఇదిగోనండోవ్ ! యిది నేనన్నమాటకాదు. (మెల్లెగా) ఆడాడ అనుకుంటుంటే మీతో అన్న.

నారా :-(ఆ యింటివైపే చూస్తూ దీర్ఘనిట్టూర్పు విడుస్తాడు)

పున్ని :- పంతులుగారూ ! మాయింటిదాకా పోదాంరాండి; బాగ్గెం పోయిందంట, వొక్కాడ పొగాకుపెట్టి తాంబూళంయిస్తా.

నారా:- (అట్లాగే చూస్తూ ఆగమన్నట్లుగా చెయ్యిసౌజ్ఞ చేస్తాడు)

పున్ని:- యేందండీ అట్టా సూస్తారు ? ఆ దయ్యాలేమైనా కానొస్తుండయా యేం ? అట్టయితే పోదాంరాండి (సంచి బుజాన వేసుకుంటాడు.)

నారా:- ( నెమ్మదిగా) వెళ్లు, వెళ్లు. నేనురాను. నీవువెళ్లు.

పున్ని :- (వెళ్లుతూ) యెళ్లక నీతో కూచుంటే యేమొస్తుంది? నెత్తికి చేతులేకదూ ! !                (నిష్క్రమించును)

నారా :- ధాన్యలక్ష్మి .. ధనలక్ష్మి... పశులక్ష్మి... గృహ లక్ష్ములతో కలకలలాడుతూ, దయా సత్య ధర్మ శౌచాలకు నిలయమై, నిరాడంబరమై, భారతమాత యథార్థరూపాన్ని తనగుండా ప్రత్యక్షం చేస్తూవుండే యీ యావరణంలో,... తం గళ్లు... జల్లెళ్లు... ఉమ్మెత్తలు— కారణం? మా కుటుంబానికి కలిగిన స్వార్థపరత. (కొంచెమునడచి) నా చిన్నతనంలో రాము లకు నాకూ యేర్పడిన స్నేహపాశం... ఇప్పుడు నా పాలిటి యమపాశమయింది. ఈ శూన్యావరణంలో... ఆ శిథిల గేహా కారంతో, వెంకయ్య కుటుంబ జీవాలు నిలిచి... నా ప్రాణాలు పెకలిస్తున్నాయి.

( అడుగులో అడుగువేస్తూ నిష్క్రమణ )

# రంగము — ౪

ప్రదేశము:— కర్ణంయింట్లో చావడి.

తెర యెత్తగా కమల, రాటం ముందర కూర్చొని యుండును.

(శుద్ధ ఖద్దరు వస్త్రములు ధరించి, పాటపాడుతూ రేకులువడుకుతూ వుంటుంది)

కమల :-

## పాట

భారత భాగ్య, మూలాధారమ- ఏకుల రాటమా||
అ॥ నీ కలిమేమొ - నీ బలిమేమొ
తెలియమైతిమి - తెలివిహీనతచే.... ॥భా॥

౧

మేంచెస్టరులో - మరల మూలమున
కూడు గుడ్డలను - కోలుపోయి, మా
ప్రాణముపోక - త్రాణయులేక
అల్లాడెడి, మా - కన్నము పెట్టవె.... ॥భా॥

౨

ఎవ్వరి మానం - బెవ్వరి ప్రాణము
కాపాడుటకెద - కరుణబూని, నీ
వేదేశంబున - కేగితివో కద
మా దేశంబును - మరచి రాటమా !.... ॥భా॥

౩

ఎన్నాళ్లాయెనో - కన్నుల కరవూ
తీరగ నిన్ను - తిలకించియు, మా
పుణ్యవశంబున - బుత్తెంచితివి
ఇక విడువము, మా - యిలవేల్పా !.... ॥భా॥

(ప్రవేశం:- నారాయణరావు; బెంచిమీదకూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తూంటాడు)

౪

మా గృహములలో - మహాలక్ష్మివై
అఖిలంబునకి - వాధారంబై
ప్రేమ సూత్రముల — భిక్షపెట్టుచును
భారతదేశము - వరిపాలింపవె !.... ॥భా॥

నారా:- ఎవరి స్నేహబలిమిచేత బాల్యావస్థ సుఖంగా గడపేనో, ఎవరి సహకారంచేత యింతవాణ్ణిఅయ్యానో, ఎవరికుటుంబం మాకేగాక మాగ్రామమందరికి అండగావుండి, గుండెనిబ్బరం కలుగజేస్తుండేదో, ఆరైతుకుటుంబం, మామూలాన బలియైపోయింది. కడుపులో... ఉరుములు...పిడుగులు...భూకంపములు... తుపానులు...

కమల:- (రాటమువదలివచ్చి ప్రక్కనకూర్చొని) ఏమిటో, భూకంపములు, తుపానులు, అంటున్నారు! ఎక్కడైనా సంభవించినవా యేమిటి?

నారా:- జీవితరహస్యాన్ని కనుక్కోలేక, హింసాకరములైన వృత్తులను కల్పించుకున్నవాండ్లకు హృదయంలోనే సంభవిస్తుంటవి జ్ఞానోదయమైనప్పుడు.

కమల:- (తేరిపారచూచి) శ్రీకృష్ణుని నిర్యాణం చెప్పటానికి వచ్చిన సవ్యసాచికి నాడు తోచిన విషాదభావాలు నేడు మీ మొహంమీద తోస్తున్నవే, దేనికి?

నారా:- నాటికి నేడు మళ్లా నిర్యాణమే!

కమల:- (ఆతుర్దాగా) ఎవరిది? ఎవరిమూలాన?

నారా:-(విషాదముగా) రైతుది...నామూలాన...

కమల:- ఓసి! దీనికేనా?

నారా:- ఇది మనస్ఫూర్తిగా అన్నమాటేనా కమలం? కాదు; నన్నెత్తిపొడుస్తున్నావు. దోపిని; దేశద్రోహిని. మానవశ్రీని హరించటానికి పూనుకున్న ఘోరరాక్షసుణ్ణి. నీవు వద్దని వారించినా వినక వెంకయ్య కుటుంబాన్ని ఆశాపిశాచానికి బలి యిచ్చిన కటికవాణ్ణి. న్యాయవాదినని పేరుపెట్టుకొని ఒకయింటి దీపమార్పేను.

కమల:- (ఆలోచించుచుండును.)

నారా:- కమలం! నాపాపానికి ప్రాయశ్చిత్తమేమిటి?

కమల.- పశ్చాత్తాపమే!

నారా:- చాలునా? మరి నాకు తరణోపాయమేమో?

కమల:- రైతుజనోద్ధరణము.

నారా:- పతనమైపోయిన వెంకయ్యకుటుంబమో?

కమల:- గ్రామస్తుల సహకారాన్నిపొంది, పడిపోయిన వెంకయ్యను, ప్రార్థించి, పిలుచుకొనివచ్చి, వారి కుటుంబాన్ని పునరుద్ధరించండి.

నారా:- (సందేహముగా) సాధ్యమేనా?

కమల:- ప్రయత్నము మన విధి. ఆత్మవిశ్వాస మనేది వుండాలి గాని, అసాధ్యమేముంటుంది?

(తెరలో) అమ్మా! పత్రిక.

కమల:- (వెళ్లి, తీసుకొనివచ్చి పుటలు తిరగవేస్తూ) "ఆక్రందనము."

నారా:- హృదయాన్ని చీల్చివేసే శీర్షిక. ఏదీ చూదాంతే!

కమల:- చూడటంకాదు, చదవండి నేనుకూడా వింటాను.

పాట

నారా:-

ఏరీతి యిక - బ్రతుకగలవో — ఇం
కెట్టుల నుందువో - భారతమాతా!.... ॥ఏ॥

౧

పట్టెడు మెతుకులు - పుట్టనిబాధచె
భార్యాపిల్లలు - బరువుగ దోచిరి
తీగెకు కాయయె - తెగబరువగు దుర
దృష్టము మనదే యీ - సృష్టికంతకును.... ॥ఏ॥

౨

పాడిపంట మము - వీడినబాధ
పూరిలేక మా — పశువులబాధ
బాధలతోనే — పరమపదించెడి
పాపికాల మే - ర్పడియెను మాతా!.... ॥ఏ॥

౩

దీనరైతు పడు - దుర్భరబాధలు
మాటుపడునను, యా - ర్భాటము వినబడు
కలిగిన మానిసి - గాదతీయునరికి
పేదరైతు నిజ — ప్రాణముపోదా.... ॥ఏ॥

కమల :- ఏం? ఎల్లావున్నది?

నారా :- బాగావున్నది.

కమల :- (ఉద్రేకముతో) అంతే? మనసులో దూరినట్టు లేదే?

నారా :- గుండె నీరయ్యేలాగు వున్నది. సరేనా? రైతు కొరకు ప్రాణా లర్పించేద్దామా అన్నట్టు వున్నది.

కమల :- ఒక్క రైతేమిటి? ప్రతీవానిగతి అంతే! దేశంలో యేమూల చూచినా ఒక ఆక్రందనధ్వని తప్ప చెవులకు రెండోది వినపడందే!

నారా :- దీనికి దేశం ఉపేక్షవహించి వూరుకుంటే యెట్లా?

కమల :- స్వార్థపరులు, ప్రేమరహితులు, అభిమానశూన్యులు, కన్నులున్న అంధులు, చెవులున్న బధిరులు, మనసున్న ఉన్మత్తులు— వీరి సంఖ్య తగ్గిపోవాలి. ఈ కారు మేఘాలు స్వాతంత్ర్యభానుణ్ణి కప్పచూస్తూవున్నంతకాలము దేశస్థితి ఇంతే!

నారా :- దేశం యీవిధంగా అధోగతి పాలవుతుంటే యేవిధమైన సంచలనం లేకుండా వుండటానికి, వాండ్లు రాతివిగ్రహాలా?

కమల :- కర్షకుల కాయాన్ని నమలుతూ, కార్మికుల రక్తాన్ని దప్పికతీరగే నరభక్షకులకు దయాదాక్షిణ్యాలు వుంటవా?

వాండ్లు మనుష్యరూప వ్యాఘ్రాలు ; మాటలు నేర్చిన మనుబోతులు. వాండ్లకు చలనమేమిటి ?

నారా :- వాండ్ల చర్య లిప్పుడు లోకానికి విపరీతంగా వుండ వచ్చునుగాని... బంగారు గనిలాంటి, దేశమాత సౌశీల్యసంపద లను ప్రకాశింపచేసే ఒరపిడిరాళ్లవుతారేమో ముందుముందు.

కమల :- కావచ్చును. కాని— కండ్లయెదుట కానరాని ప్రాణములుపోని విచిత్రపు నరహత్యలు జరుగుతూవుంటే చూస్తూ కూర్చున్నవారిని యేమనాలి మరి ?

నారా :- ఆ విచిత్రపు నరహత్యలలో మానసికంగాకూడా వాండ్లు భాగం పంచుకోవటంలేదని నీ వెట్లా చెప్పగలవు ?

కమల :- మాటవరుసకు వేదనలో పాలుపంచుకుంటున్నారని ఒప్పుకున్నా— వేదన ఉపశమించటానికి పాటుపడనప్పుడు, వారితో ప్రయోజనమేమి ?

నారా :- ఆ శుభసమయం వస్తూవున్నదిలే వుండు.

కమల :- ఎప్పుడు ? పల్లెటూళ్లు సాంతం స్మశానదిబ్బలై పోయిన తరువాతనా? కర్మాగారాల్లో గబ్బిలాలు నివాసమేర్పరచుకున్న తరువాతనా ? నిరుద్యోగంచేత కృశించి కూలారుతూ వున్నవారిమీద కాకులు గ్రద్దలు బోరువలు వ్రాలిన తరువాతనా?

నారా :- (నిట్టూరుస్తూ) నేను భరించుకోలేను కమలా ! నీ మాటలు వింటూవుంటే నా ప్రాణాలు ఘటాన్ని చీల్చుకొని శూన్యంపైకి పోతూవున్నవి ..... కాలం అమూల్యమైనది. అది రెక్కలు కట్టుకొని పరుగిడుతూవుంటుంది. ఈ రోజున వ్యర్థంగా పోగొట్టుకున్న కాలం రేపు కలిసిరాదు. వెంకయ్య కుటుంబాన్ని పిలుచుకొనివచ్చి యథాశక్తి దేశాభ్యుదయానికై పాటుపడటానికే యీ క్షణమే తీరుమానించుకున్నాను. (కాలరు, నెక్టయి, కోటూ వూడదీస్తూ) ఇక నాకీ పరాయివేషాలతో, యీ పటాటోపాలతో

పనిలేదు. నా కిక యే అధికారి ప్రాపకంతో అవసరంలేదు. నీవు వడికిన నూలుతో తయారైన దివ్యవస్త్రాలను నీ చేతిమీదుగా నాకు ప్రసాదించు. ధరిస్తాను. ఊఁ... తీసుకరా! ఇక ఆలస్యం పనికిరాదు.

కమల:- (లోపలికి వెళ్లుతుంది)

(ప్రవేశం :- కాంతయ్య)

కాంత:- బాబూ! దత్తతనుగురించి ఒక పెద్ద దావా వచ్చింది. సలహా చెప్పుతే సలహై యిస్తానన్నాడు వాడి. వందకు తక్కువ పుచ్చుకోనదని నే నన్నాను. వెలుపలికి వస్తావూ? మాట్లాడుదాం.

నారా :- (తండ్రి ముఖం కేసి చూస్తూవుంటాడు.)

కాంత:- ఏం?

నారా :- (సాగుడుగా) ఊఁ......

కాంత :- ఏమిటి నీ సందేహం? ఫీజు చాలద నేనా? వాడి డబ్బుకలవాడే!

నారా :- (నేలవైపుచూస్తూ) డబ్బు... కలవాడు... అయితే?

కాంత :- ఏమిటి నీ యాలోచన?

నారా :- నా ఆలోచన మీతో... చెప్పటానికి...

కాంత :- భయమా? సందేహమా? అబ్బే! యెందుకు? నీ వుద్దేశ్యమేమిటో స్పష్టంగా చెప్పు, వింటాను.

నారా:- నే నా వృత్తిని...... మానుకున్నాను, నాన్నా!

కాంత :- (ఉలిక్కిపడి) ఎప్పుడు?

నారా:- ఇప్పుడు.

కాంతః- కారణం ?

నారా :- బుద్ధిపూర్వకంగా చేసి మూటకట్టుకున్న ఘోరపాత కాలవల్ల కలిగిన పశ్చాత్తాపము.

కాంత :- (ఎలాకపోయి) లోకోపకారులైన న్యాయవాదులు అనుకొనవలసిన మాటలేనా ఇవి ?

నారా :- (ముఖం చిట్లించి, చీదరగా) న్యాయ...వాదులు, లోకోప...కా ..రులు. ఈ బిరుదులు మాబోటివారికి అజా గళస్తనముల వంటివి నాన్నా ! మా లోకోపకారాలేమిటో మా అంతరాత్మలకు తెలుసు, అనుభవిస్తున్న పార్టీలకు తెలుసు.

కాంత :- ఎవరైనా వింటే నవ్విపోతారు. సుగంధ ద్రవ్యం లాగా నీ ప్రతిభ నాలుగువేపులా వ్యాపిస్తూవున్న సమయంలో నీ కిట్లాంటి పాడుబుద్ధి పుట్టిందేమి గ్రహచారం ?

నారా :- పాడుబుద్ధికాదు నాన్నా! పవిత్రమైనబుద్ధి. చూడండి. వెంకయ్య పతనంతోటి మనదుష్కీర్తి దుర్గంధములాగా నాల్గు వేపుల వ్యాపించింది.

కాంత :- వాడి కాలమొచ్చి వాడు పోతే,—మధ్య యెవరు చేసిం దేమున్నది ?

నారా :- నాన్నా ! నిజం చెపుతాను కోప్పడకండి. మనం యెట్లాంటి కపటనాటకా లాడుతూవున్నది మనకు తెలుసును. వెంకయ్యది-వెంకయ్యలాంటి వాండ్లవి యెంతమంది నోళ్లుకొట్టి, మనం బ్రతుకుతూవున్నది మనకంటె తెలిసినవాండ్లు వుండరు. చేసినపాపాలు పర్వతాలై పెరిగిపోతూవున్నవి. నేటితో ఈశ్వరుడు అనుగ్రహించాడు. మనకొరకు మోక్షద్వారాలు తెరిచాడు. నేనీరోజునుంచి నిష్కామ్యమైన బుద్ధితో దేశసేవ చెయ్యాలి అను కున్నాను. నాతోపాటు మీరుకూడా నడుముకట్టండి. ప్రయి వేటు వృత్తికి ఈ క్షణంనుంచి భరతవాక్యం చెప్పండి. అది మనకే గాక మన జాతికంతటికికూడా కళంకం తెచ్చిపెడుతూవున్నది. వెం

కయ్యను పునరుద్ధరించటానికి మీరుకూడా తోడుపడండని నామనవి.

కాంత:— అయిందా వుపన్యాసం? ఏమిటీ యీ ఆవేశం? ఏమిటీవిపరీతం? వెంకయ్య నేమిటి, పునరుద్ధరించట మేమిటి? సాధ్యమయ్యేపనేనా?

నారా:- నాన్నా! ఇవి వెనుకటి రోజులు కావు. ప్రజలలో సంఘీభావం, ఆత్మవిశ్వాసం, వాటెంతటవి పుట్టుకొనివస్తున్న రోజులివి. పురాతన ప్రభుత్వ పద్ధతులకు కాలదోషం పట్టింది. ఎక్కడచూచినా ప్రజాశక్తి రాజ్యంచేస్తున్నది. ప్రజాశక్తి విజృంభించి సింహాసనాల పునాదులనే కదిలించి వురూత్రితలూపి తల క్రిందుచేస్తూవుంటే, తలక్రిందైన వెంకయ్యపరిస్థితినిసరిచెయ్యలేదు?

కాంత:— అంతా ఒకట్లైతేనూత్రిం, ఆచేసే ఉద్ధరణ మేమిటో నాకు బోధపడలేదు.

నారా:- "భూమి" అన్నిజీవులకు అనుభవ యోగ్యమైంది నాన్నా! అందుచేత భూమిమీద అందరికీ సమానహక్కు వున్నదని ఒప్పుకోవాలి. అట్లాంటి భూదేవిని బలంకలవారు బంధించి, ఆమె ఆతిధ్యాన్ని బలంలేనివారు స్వీకరించటానికి వీలులేకుండా తమరు మాత్రిమే అనుభవించటం సృష్టికి వ్యతిరేకం నాన్నా! ప్రికృతి—— విప్లవాలు రేపుతున్నదీ అంటే, యిట్లాంటి కారణాల చేతనే నేమో అనుకుంటాను నేను. ఇట్లాంటి విషయంలో వెంకయ్యను పిలుచుకొనివచ్చి మనతోపాటు—— గ్రామంలో అందరితో పాటు, భూమి గొడ్డు గృహాము యేర్పాటుచేసి మార్గదర్శికులం కావలెనని వుంది నాన్నా, నాకు.

కాంత:- నిన్ను చదివించిన చదువు చివరకీవిధంగా పరిణమించిందీ?

నారా:- మనం చదువుకున్న చదువు, మన దేశాభ్యుదయానికి అక్కరకు రాకపోయిన తరువాత తగలెయ్యనా?

(ప్రవేశము- కమల, కద్దరుగుడ్డలతో)

కమల:- మామయ్యా! మీ కుమారుడు మంచి త్యాగిగా మారేడు. మీరు నిజంగా అదృష్టవంతులు.

కాంత:- నీ ప్రోత్సాహంకూడా కొంత వున్నట్టుందే? అట్లా చెప్పు! అగ్ని దేవుడికి వాయు దేవుడు కూడా తోడైనాడూ? ఇక కొంప లంటుకోవటంలో ఆశ్చర్యమేముంది? మీ మాటలు, మీ ఆశయాలు, మీ వ్యవహారాలు వింటూంటే, నాకు కడుపులో వికారం పుట్టుకొని వస్తున్నది.

(నిష్క్రమించును)

కమల:- (కద్దరుగుడ్డలు భర్త చేతికిచ్చును.)

నారా:- (కండ్లకద్దుకొని) వీటిని ధరించి నేను భారతవీరుణ్ణి అవుతాను.

కమల:- వీరుడికి కావలసిన కవచం నా చేతిమీదుగా తయారుచేసి యివ్వటంచేత నేను ధన్యురాలిని.

నారా:- రైతు సోదరులకు మంచి ప్రబోధం కలుగచేసి వారి అనుమతిమీద బెజవాడకు వెళ్లుతాను. నీవు ఆడవాండ్లకు గృహపరిశ్రమలను గురించి, మహాత్ముని సందేశాన్ని గురించి ప్రచారం చేస్తూ వుండు.

కమల:- అంతకంటె నాకు కావలసినదేమున్నది?

నారా:- ముందు మానాన్నగారికి వుద్యమ మేమిటో నచ్చ చెప్పి, వారిని నాలోకి తీసుకుంటాను. (పోబోవును)

కమల:- నాన్నగారిని మీలోకి తీసుకోగలిగితే మీ రీ ఆంధ్రదేశానికి (చిరునవ్వుతో) జవ్హారీలాల్ నెహ్రూగా రేకదూ !!

నారా:- (నవ్వుతో) నీ వెట్లాగో కమలవేగా !!!

(తెర)

# నాలుగవ అంకము

## రంగము — ౧

ప్రదేశము:- బెజవాడ ఫేక్టరీలో వెలుపలిభాగం

ప్రవేశము:- రాములు, భూదేవి

భూదేవి :- ఏమో పడిపోయినట్టు పిలుచుకవచ్చావు గాని, యింకా పనిలోకిపొయ్యే గంట కొట్టలేదు. "కొత్తబిచ్చగాడు పొద్దెరుగడు" అన్నమాట నిజంచేశావు.

రాములు :- చేసేపని యెట్టాగో చెయ్యాకతప్పదు; మాట పడకుండా వుండటం మంచిదని వకగడియ ముందొచ్చినాము. తప్పు లేదు లే !

భూదేవి :- మాటపడకుండా వుండగల మన్నమాట మరిచిపో. పొద్దస్తమానం ఆ వరసన రెక్కలిరగతీసుకుంటున్నా వారికి మెప్పు లేదు. యాదమరిచి యేదైన పనిలో పొరపాటొస్తే కూలివాండ్ల పాట్లు కుక్కలుపడవు.

రాములు :- యేమిచేస్తాము ? వకరికి ఒళ్లమ్ముకున్నప్పుడు యెన్నన్నా పడాలి. ఈదిగులు మనసులో పెట్టుకోనేనా, రోజుకు రోజుకు చిక్కి యిట్టా అయిపోతున్నావు?

భూదేవి :- అసలీ మరల్లో పని చెయ్యాటం, యీకొళాయల్లో నీళ్లుతాగటం, యీమరబియ్యం తినటం, నాకొంటికి పడ లేదయ్యా. యెప్పటికైనా మన పొలంపని చేసుకుంటూ, మనకు పండినగింజలు తింటూ, మనగుడ్డలు మనం కడుతూ, మనవూళ్లో మనం వుండక పోతే నాబతుకు నిజంలేనట్టుంది.

రాములు:- (తలగోకికుంటూ, కండ్లుమూసుకొని) అబ్బా! మళ్లీ మన పొలాల్లో!! అంత పుణ్ణెం మనంటి వాళ్లకేనా ? (కండ్లు తెరిచి) మనుగుడుపుల్లోమాట లఘునాలల్లో తలుచుకోటం యెం

దుకు ? మనమాటకేంగాని, మా అమ్మా, మా అయ్యా, వక్క సారే చెల్లుకునేటట్టున్నది.

భూదేవి:- పేలుపడ్డవా యేం ? తల గోక్కుంటున్నావే ? చూస్తాను రా.

రాములు:- ( భూదేవి ఒడిలో కూర్చుంటాడు. )

భూదేవి:- పాపము, అత్త, మామను—— డాకటేరుగారు పండబెడుతున్నారా ? అడ్డమైన నీచకపు చాకిరి చేయించుకునేది, నెలనాటికి జీతపుడబ్బు లడిగితే అడ్డమైన మాటలు అనేది. యీ నాటికి యీ గతి పట్టిందిగాని, వాండ్లు బతికిన బతుక్కు వకమ్మ పెట్టిన యెంగిలిమెతుకులు నెత్తిన పెట్టుక తెచ్చుకోటమా?

రాములు:- పెత్తనాన వాండ్లుపడే కష్టాలు చూస్తుంటే, నా గుండెకు కూడు పట్టటంలేదు పిల్లా!

భూదేవి:- ( రాముల తలగుడ్డ తీసి) ఏందో మూటఉన్నదే? రూపాయలా ?

రాములు :- రూపాయలు మూటకట్టే రాతవుంటే, నీతలకు ఆముదమైనా గతిలేకుండా చేస్తానా ?

భూదేవి:- (మూటవిప్పి) ఆకు, వక్క, సున్నమూనా ? నాచేతిమీదుగా నీకు తాంబూళమిచ్చి, నీవు నాకు తమ్మపెట్టి మెన్నాళ్లైంది మామా ? ఇదుగో ! (నోటితో పెట్టబోవును.)

రాములు :- అబ్బే నాకొద్దు. నీవేసుకో. ( ఆమెచేతిని ఆమె నోటిలో పెట్టబోవును.)

భూదేవి:- నాకొద్దు. నువ్వేవేసుకో !

రాములు :- ఆ... నివ్వేసుకోమంటే వినరాదు ? యేదైనా సరే, నీవుతింటుంటే నేను తింటున్నంత నిండుగా వుంటుందీ నాకు.

( ఊడలాగి ఆమెనోట్లో కురుకును.)

భూదేవి:- యెందుకు మామా యింత మరులు నామీద ?

రాములు:- నామీద నీకుండబట్టి.

భూదేవి:- నన్నిట్టా నీవు అన్నెందాల కనిపెట్టివుండబట్టి నీ మురులు నేను కనుక్కున్నాను. నేనేతీరాన కనపరిస్తే నీవు కనుక్కున్నావు ?

రాములు:- నీవేతీరాన కనపర్చటంలేదు గనుక? నీకండ్లతో కనపర్చటంలేదా ? నీ కనుబొమ్మలతో కనపర్చటంలేదా ? నీ చేతులతో కనపర్చటం లేదా ? నీ చేష్టలతో కనపర్చటం లేదా? నీ మాటలతో కనపర్చటంలేదా ? నీమనస్సుతో కనపర్చటం లేదా ? (ఆమె చెయ్యిపట్టుకొని) ఇదుగో యీ పులకరించిన నీ ఒంటితో కనపరుస్తున్నావా లేదా?

భూదేవి:- యెంత వగలమారి మాటలు మామా నీవి ? అన్నిమాటలు అట్లా వుంచుగాని- నా మనసులోమాట నీ కెట్టా తెలిసిందో చెప్పు !

రాములు:- నీ మనసులోనేకాదు.. నేను మేడకట్టుకొని కాపరం చేస్తున్నది? నాకు తెలియందేముంది ?

భూదేవి:- అట్టయితే యిప్పుడు నా మతిలో యేమనుకుంటున్నానో చెప్పు చూతాం !

రాములు:- చెప్పేది ? చెప్పిం తరువాత అనుకున్నంతపని చేసితీరాలె. యేమనుకుంటున్నావంటే:— నన్నమాంతం కావలించుకొని యీ చెంపా ఆ చెంపా, మార్చి మార్చి ముద్దుపెట్టుకోవాలె నని మురిసిపోతున్నావు పిల్లా !

భూదేవి:- అమ్మదొంగా ! ఆడదాని దాపరికం నీ దగ్గర దాగేటట్టులేదే ? ఇట్టాంటివాణ్ణి ముద్దుపెట్టుకోటం కాదు. కాళ్లు కడేటట్టు కసితీర కొరికి నములు తినాలిసిందే ! ( తన గుండెమీదికి అతని తలను తీసికొని తన తలను అతని ముఖంమీదికి వంచును. )

రాములు:- ఆడదాని దాపరికమంటావు? యింకోక ఆడది వున్నదా ?

భూదేవి:- ఎంత నిజంగా అన్నావు మామా!...

(ఫేక్టరీలో గంటమోత వినిపిస్తుంది.)

రాములు:- అదుగో గంటకొట్టేరు. పోదాం రా.

(నిష్క్రమణ)

## రంగము—౨

ప్రవేశం:- ఫేక్టరీ మేనేజరుగది. తెరయెత్తగా, యేడుకొండలు. (మేనేజరు.)

యేడు:- బల్లకెదురుగా కుర్చీమీద కూర్చొని, చుట్ట తాగుతుంటాడు.)

(ప్రవేశం రత్తమ్మ)

యేడు:- ప్రపంచమంతా మోసంతోవుంది రత్తమా!

రత్త:- కోపమొచ్చింది కామాలె; బూదేవి మాటకేకాదు? ఇవ్వేళ సరిచేస్తాలేండి.

యేడు:- కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్టేకదూ నిన్ను నమ్ముకుంటే!

రత్త:- యేం చెయ్యమంటారండీ! పనిలోకొస్తే ఆ పిల్ల వకచోటా, నేనొకచోటా అయిపాయెను. ఇంటికిపోయి మాట్లాడుదామంటే, అత్తా మామల కత్తెరబోనైపాయెను. అక్కడికీ వచ్చేటప్పుడు పొయ్యేటప్పుడు మీమాటలే—మన ఫేక్టరీ ఖామందుగారు యెంతమంచివారు; పేదవాండ్లంటే ప్రేణాలు యిదుస్తాడు. ఎంతమంచి అందగాడో చూశావా పిల్లా? అంటే నవ్వి వూరుకుంటుంది గాని జవాబు చెప్పదండీ! వట్టి గబ్బిపిల్లాలె వుందండీ! నిన్న శానా ఆశపెట్టి మాట్లాడితేను, మొహాం మాడ్చుకుందండి!!

యేడుః- ఏమిరోగం? డబ్బు చేదా యేమిటి?

రత్త:- యేమోనండీ! యీ నాలుగు నెల్లనుంచి చూస్తున్నాను కదా! నలుగురితోపాటు నవ్వుతూ పేలుతూ, చకచకలాడుతూ వుండదు. యేదో దానెబ్బసొమ్ము పోయినట్టు, తలకాయ వొంచుకొని పనిచేస్తుంటుంది. యెవరివంకా చూడదు. కలుపుకోలు పిల్ల కానట్టుంది, బెట్టుసరి మనిషి.

యేడుః- అనుకూలపడకపోతే యేంచెయ్యాలి?

రత్త:- రెండుమూపాయలు గల్లుమనిపిద్దుమూ - కొండమీది కోతి దిగిరాదట.

(ప్రవేశం:- పోలీసు సబ్ యిన్స్పెక్టరు, కాన్ స్టేబిల్)

యేడుః- గుడ్మార్నింగ్! ఏదోపనిమీదదయచేశారే!(గాభరా)

సబ్ :- అవును, సెటిల్మెంటునుంచి ఒక యానాదీవాడు పరారీఅయినాడు. వాడు కే. డీ. ఇక్కడ పనిచేస్తూవున్నట్టు జాడా తెలిసి వచ్చాము.

యేడుః- వాడిపేరు?

సబ్ :- ఇక్కడ పేరు ఏంపెట్టుకున్నాడో! వాడి అసలు పేరు గంగడు.

యేడుః- ఎట్లాంటి చహారా కలవాడో? ఇప్పుడవంతా మెందగ్గాని- కష్టమనుకోనక సాయింత్రం ఆరుగంటలకు దయచెయ్యండి. కూలీలందరికి డబ్బు బట్వాడా చేస్తుంటాను. మీరీగదిలోనుంచి చూస్తూ వాణ్ణి ఆనవాలు పట్టవచ్చును. ఇప్పుడు వాడేమూల యేపనిలోవున్నది కనుక్కొనటం కష్టం.

సబ్ :- పైగా మావాసన పారిందీఅంటే వాడీపాటికి కాలికి బుద్ధిచెప్పే వుంటాడు. సరే, మీరన్నదే బాగావున్నది. సాయింత్రం ముందుగా వచ్చి యీ గదిలో కూర్చుంటాను; శెలవు.

యేడు:- చిత్రం.

సబ్ :- ( అవతలకు నడిచి కాన్‌స్టేబిల్‌తో) మన మొకమాటు తిరిగి చూచి వస్తాం రా.

(నిష్క్రమింతురు.)

యేడు :- వెళ్లిపోయినాడులే ! వట్టి పోచికోలు మాటలతో కడుపు నిండదు రత్తమ్మా.

రత్త :- పోచుకోలుదానికిందర కట్టేరుకదూ నన్ను ? ఎంత మర్యాదగా వుంటేనేమి ? ఒక్కమాటలో పోతుందండీ! మీ మాట అంటే నెత్తినపెట్టుకొని చేస్తానే! మొన్నటిమటుకు మొన్న ఆ బొందిలిమనిషిమీద కన్నేసి కావాలే అని పట్టుపడితే, దాని మనసు యెట్లా యిరిచానో దానికి యేమని చెప్పుకున్నానో, పంపిచ్చానంటారా, లేదంటారా ?

యేడు :- పంపిచ్చావులే !!

రత్త :- దానికి పాపం యేమీ ఇయ్యనే లేదకే !

యేడు :- ఏదీ ! ఇచ్చిందాకా వున్నదా ? ఎవరో వస్తున్నట్లున్నదని దులుపుకొని పరుగెత్తటమే అయిపోయెను.

రత్త :- మన జగ్గెడపనిచేసేవాండ్లల్లో వక తెలగమనిషి వున్నది. మీరు చూడలేదు గాని— చూస్తే కన్నుదొరగించాలి సిందేకదూ !

యేడు :- దానిమాట తరువాత చూచుకుందాము గాని, ముందీ భూదేవిమాట తేలుస్తూ ! ఏపని చేస్తున్నా కండ్లల్లో మెదులుతుంటుంది. దాన్ని యెట్లాగైనా యీ గదిలోకి పంపించే వుపాయం చేస్తే, ముందు శాస్త మచ్చిక చేసుకుంటాను.

రత్త :- అయితే నేనువెళ్లి ఆపిల్లతో "మీ పుట్టింటికాణ్ణుంచి నీకు వుత్తరం వచ్చిందంట. అది మన అయ్యాదగ్గిరవున్నది. పోయి

తెచ్చుకో అమ్మా!'' అనిచెప్పి పంపుతాను గాని, ముందు కాస్త పైదువ్వులు దువ్వి, అంకెరు తెచ్చుకోండి.

యేడు:- భేష్! ఇది మంచిసమయం; ఎవరివనిమీద వా రు న్నారు, పంపు పో.

రత్త:- నా చీరమాట మరచిపోయినారుకదూ ?

యేడు:- (బుజంమీద చెయ్యివేసి తట్టుతూ) ఒకటికాదు; రెండు కొనిపెడతాను. పో!

రత్త:- (నిష్క్రమించును)

పరివేశము—రాములు

యేడు:- ఏమిటార్రి యెందుకొచ్చావ్ ?

రాములు:- బండ్లమీద దూడిబోరేలు యెత్తేమండీ! అవి రైలుకాడికో పెరిస్సుకాడికో తెలియలేదు.

యేడు:- మాగుమాస్తాను కనుక్కో పో, అతను "సఖా—అంటే, ఆరునెల్ల'' మనిషి. కూరలు కొని యింట్లో యిచ్చిరావయ్యా అంటే అదేఃపోత పోయినాడు. మాయింటికెళ్లి, ఆయన్ను గూడా పిల్చుకొనివెళ్లు బండ్లతో. మాయింటిపక్క కొట్లో నేను తెమ్మన్నానని చెప్పి నాలుగుకాడల చేబోర్లు పొగాకు తీసుకొని నాకు ముట్టచెప్పిమరీపో. గుమాస్తాతో ఇక్కడ పనిలేదు. నీవు మాత్రము వచ్చియిచ్చిపో.

రాములు:- సరేలెండి. (నిష్క్రమించును)

యేడు:- (అద్దంలో ముఖం చూచుకొని క్రాపుదువ్వుతూ, మీసాలు మెలివేస్తూ, కూనిరాగాలు తీస్తుంటాడు.)

(పరివేశం భూదేవి)

యేడు:- (సంచిలోని రూపాయలు బల్లమీద కుమ్మరించి లెక్కవేస్తూ) ఏం, అమ్మాయి! రా. అనుమానిస్తావెందుకు ?

భూదేవి :- మా కన్నోరికాడనుంచి వుత్తరమొచ్చిందిటే అయ్యా ?

యేడు :- ఎక్కడిదో వచ్చింది. ఆ వుత్తరం నీదేనా ?

భూదేవి :- నాదే అయ్యా !

యేడు :- రత్తమ్మ నీతో యేమని చెప్పింది ?

భూదేవి :- వుత్తరం అయ్యదగ్గర వున్నది; తెచ్చుకోమని చెప్పింది.

యేడు:- ఇప్పుడు కాదు; ఇదివరకు.

భూదేవి :- యేమీ చెప్పలేదు నాయనా !

యేడు:- అసలు రత్తమ్మను బాగా యెరుగుదువా ? చనవుగా మాట్లాడుతావా ?

భూదేవి :- (తలవంచుకొని) ఆమెను యెక్కువగా యెరిగిన దేమున్నది? నలుగురితో పాటే.

యేడు :- (కింది పెదవిని పై పండ్లతో వొత్తిపట్టి, తల వూపుతూ బల్లమీది రూపాయలలో ఒకటి క్రిందికి దొర్లించి) అమ్మాయ్ ! ఆ రూపాయి యిట్లా తెచ్చియ్యమ్మా !

భూదేవి:- (తీసి అతను చాపిన చేతిలో పెట్టును)

యేడు :- (ఆమె చెయ్యి తాకి స్పర్శసుఖం అనుభవిస్తూ) మరచిపోయినాను, నీపేరేమిటి ?

భూదేవి – ఎందుకయ్యా ! (తనలో) పొరపాటున చెయ్యి తాకింది కామాలె.

యేడు:- వుత్తరంమీది పేరుచూచి యివ్వవద్దూ ?

భూదేవి :- భూదేవండి !

యేడు:- (బల్లసొరుగులో కాగితాలు వెతుకుతూ) నీ మొగుడి పేరు ?

భూదేవి:– (తలవంచుకొని, కాలిబొటనవేలు నేల రాయుచుండును)

యేడు:- ఓహో ! చెప్పకూడదు కదూ !! ఏంపని చేస్తుంటాడు ?

భూదేవి:- మన ఫేకటరీపనిలోనే తిరుగుతుంటాడండీ !

యేడు:- మీాదీవూరేనా ? ఇంకెక్కడినుంచైనా యెత్తి వచ్చారా ?

భూదేవి :– పొట్ట జరక్క పడమటి సీమనుంచి వచ్చామండీ.

యేడు:- అయ్యయ్యో ! అట్లాగా పాపం ! గుడ్డలు చిరిగిపోయి నవే ! నాలుగు రూపాయలు అడిగి తీసుకొని వాడుకోనకపోయినావా ?

భూదేవి :– అది తీరేదెట్టా ? ఏ రోజు కూలిడబ్బులు ఆరోజు తింటికే బొటాబొటీలే అయ్యా !

యేడు:- అయితే, నీభర్త మునలివాడా, పడుచువాడా ? చెప్పు.

భూదేవి:- (మోహం చిట్లించి) జాబు కనపడితే ఇయ్యండి, పనిలోకిపోతాను.

యేడు:-: ఇక్కడమాత్రం మనపనికాదూ ? నీ జాబు యింటిదగ్గర కాగితాల్లో పడ్డదేమో ! వాటికోసం మనిషిని పంపేను. తెస్తాడుండు.

భూదేవి :-మళ్లీ వస్తానులెండయ్యా! (పోబోవును)

యేడు :- (బల్లమీాదివి రెండు రూపాయలు క్రిందికి దొర్లించి) అయ్యయ్యో ! మళ్లీ రూపాయలు క్రింద పడ్డాయి. అవి నీతోనే వస్తానంటున్నవి. ఇట్లాతే !

భూదేవి :- ( తీసి కండ్లకద్దుకొని, బల్లమీాద పెట్టుతుంది.)

యేడు :- (ఆమె చెయ్యి పట్టుకొని, ఒకమోస్తరు అర్థంలేని నవ్వుతో) ఊ... ..ఏ మంటావు ?

భూదేవి :- (చెయివదిలించుకొని, కంపముతో) ఎందన్నా! అట్టా అంటావు ?

యేడు :- (వాకిలి కడ్డముగా నిలుచొని) ఆ... యేమున్నది? ఏదో వకసారి ప్రాపిక చేసుకుంటావేమోనని...ఊ...

భూదేవి :- (కండ్లనీళ్లతో) అన్నా ! రెక్కలు విరిగేటట్లు నీకు చాకిరిచేసి, నీకడుపులో కూడు తీసుకొని తినేదాన్ని, నన్ను— నీవే యిట్టాంటి మాటలంటే యింక నాకు దిక్కెవ్వరు ?

యేడు:-అబ్బే! నీవేమి అనుకోవద్దు. ఊరికేకాదులే ! అందరూ ఇండ్లకు పోయిన తరువాత, కాసేపుంటే, నిన్ను అన్నెందాల సంతోషపెడతాను. నీ సంసారాన్ని నేను పోషిస్తాను. సరేనా?

భూదేవి :- (దయనీయంగాచూస్తూ) కడుపులో కాలి, నీవు తండ్రివంటివాడివి కదా అని, నీ అండ చేరితే నీవీ పాడుపనికి తల పెడుతావు ! వాకిట్లోనుంచి లేండి, పోతాను.

యేడు :- నీవు మూర్ఖానపడితే నేనూ మూర్ఖానపడాలిసి వస్తుంది. ఎటుతిరిగీ నీవు తప్పించుకోలేవు. ఆభాగ్యానికి బెట్టుసరి యెందుకు? ఇప్పుడేమీ చెయ్యనులే! ఒకముద్దు పెట్టుకొని పంపిస్తాను. ఏం పలుకవూ ? (సమీపించును.)

భూదేవి :- (జేగురించిన ముఖంతో) ఆమాయముండానీవూ కలిసి యీ తంతు పన్నినారు. పరువుగా బతికినవాడివికామాలె. నీ పరువు బద్దలయ్యే గడియొచ్చింది. నా ప్రాణం పోవటానికైనా వొప్పుకుంటాను గాని మానం పోవటానికి వొప్పుకోను. ఆడదిగదా అని అనుకున్నావేమో ! నిన్ను మెడపెట్టి గెంటి నీ మర్యాద మాపుతాను జాగ్రత్త.

**యేడు**:— తొండముదిరి, వూసరవెల్లి అవుతున్నదే! పిచ్చిగా వాగబోకు. నే నిప్పుడేమిచేస్తే నీ యబ్బ యెవడడ్డుకోగలడు? (మీదికిపోయి కౌగలించుకొన చూస్తాడు)

**భూదేవి**:- (తప్పించుకొనుటలో కుర్చీ తగిలి క్రిందపడును)

(ప్రవేశం—రాములు)

**రాములు**:- (ఒక్కదూకులో గదిలో ప్రవేశించి, చేతిలో పొగాకు విసిరి నేలకు కొట్టి) దానెబ్బ కాదు నీ తాత యెవడడ్డ మొస్తాడో పిలిచిచూడు! (యేడుకొండల చెంపమీద ఫెళ్లున ఒక దెబ్బకొట్టి, తలపట్టి నేలకువంచి పిడికిలి పైకెత్తును.)

(ప్రవేశం:—సబ్ యిన్సుపెక్టరు, కానిస్టేబిలు)

సబ్:- ఏయ్! ఎవడది? ఏమిటా దౌర్జన్యం? వరే మూడూ యాభై రెండూ, విడిపించు చూస్తావేం?

**కాని**:- (ప్రయత్నంమీద విడిపించును.)

**యేడు**:— (గడ గడ వణకుతుంటాడు)

**రాములు**:- వీడికి పుట్టిన పోగాలం చూడండయ్యా! ఆడ కూతుర్ని అన్నేయం చెయ్యటానికి తలపడ్డాడు నే నొచ్చేటప్పటికి!

సబ్:— అరెరే పాపం, రేప్ కమిట్ చేశాడన్నమాట. నే నిందాక నే ఇతని నడతను గురించి అనుమాన పడ్డాను. ఒంటరిగా ఒక బటాచోర్ ముండతో మాట్లాడుతూ నన్నుచూచి మొహం వేళ్లాడవేశాడు. వరేయ్! ఆ మేకలు తొక్కిన బండ యెవతో కనుక్కొని యిట్లా ఈడ్చుకరా. జరిగిన సంగతులేమిటో పూస గుచ్చినట్టు ఆమెను స్టేటుమెంటు యివ్వమనోయ్!

(జేబులో నుంచి కాగితం ఊటకలం తీయును.)

**యేడు**:—(నాలుకతో పెదవులు తడుపుకుంటూ, ఆపాద మస్తకం వణుకుతూ ఏదో చెప్పబోయి, నోటివెంట మాటరాక,

గుర్రిడ్లు మిటకరించుకొని, సబ్ యిన్సుపెక్టరుకు అయిదువేర్లిళ్లు చూపును.)

**సబ్** :- ఓ షయిఫు హాండెర్లిడ్సు, దటీజ్ ఆల్ రైట్!

**యేడు** :- అవును హస్తమేనండీ! తమరు గ్రహించింది నిజమే! అసలు సంగతి వినండి. క్రిందపడిన రూపాయలు ఆమె అందించటంలో హస్తానికి హస్తం తగిలిందండీ! ఇంతకంటె నేనే కర్మ ధర్మం యెరగను. చూచారుగదా నన్ను ఖూనీ చెయ్యటానికి తలపడ్డాడు, వీడిపొగరు చెండ!

సబ్ :- నేను చూచానుగా! అసలీ ఆడమనిషి యీగదిలోకి యెందుకొచ్చింది?

**భూదేవి** :- "మీా కన్నోరికాడినుంచి వుత్తర మొచ్చింది, తీసుకొపో" మ్మని రత్తమ్మ చేత చెప్పిపంపుతేను వచ్చినానయ్యా!

సబ్ :- (రాములవైపుచూచి) ఈ యాడమనిషి నీ కేమౌతుంది?

**రాములు** :- నా భార్యేనండీ!

సబ్ :- నిజంగా నీ భార్యేనా? ఎవరి భార్యనైనా లేవనెత్తుకొని వచ్చిన బాపతా? నీ మొహం చూచి ఆ మనిషి మొహం చూస్తే "కాకిముక్కుకు దొండపండు కట్టినట్టు" వుందిలే! అందుకని.

**రాములు** :- ఒకడి పెండ్లానికి ఆశపడటానికి యినప్పెట్టెనిండా రూపాయలైనా వుండాలె—చేతినిండా అధికారమైనా వుండాలె. రెక్కలాడితే గాని డొక్కలాడని నాకు, యెవరి ఆలికో ఆశపడే కావరం యెట్టా పుట్టుతుందయ్యా?

**సబ్** :- ఛీ! నీకేమీా బుద్ధిలేదు? అధిక ప్రసంగం చేస్తావెందుకు? ఎవరోయ్ జవాన్! వీండ్లిద్దరిని ష్టేషనుకు తీసికెళ్ళి చెరియొక కొట్లో హాజరుపెట్టి వుంచు, విచారించాలి.

కాన్‌స్టేబులు :- నడవండి స్టేషనుకు (ఇద్దరిని తీసుకపోవును)

సబ్ :- ఏమయ్యా నీ అయిదొందలు !

**యేదు** :- (లోపలికి వెళ్ళి వచ్చి కవరు చేతికిస్తూ) కవరులో అయిదునోట్లువున్నవి. చూడండి నన్నింతగా అగౌరవపరిచిన వాండ్లకథ కనుక్కోకుండే వీలులేదండీ !

**సబ్** :- అనవసరంగా మీకుగాని వాండ్లకుగాని చిక్కులు తెచ్చిపెట్టటం నాకిష్టంలేదు. అయినా చూద్దాంరండి. చివరకి దబాయించైనా మీకాళ్లు పట్టిస్తాను. ఇంతకూ నిజంచెప్పకపోతిరే! అది తత్సంబంధమే నైయుండి లోపలికి రాగానే దానిపెనిమిటి పసిపట్టి వచ్చాడంటారా ? లేక ఆ తరహా మనిషి కాకపోవటాన పెనుగులాడుతూ వుండగా అది కేకవేయటంచేత వాడొచ్చాడంటారా ?

**యేదు**:- ఏ తరహా మనిషనుకోటానికీ వ్యవధేదండీ ? పైకం లెక్క చూచుకుంటుండగా వచ్చింది కాబోలు. నేను దానిని మొదట చూడనేలేదు. పలుకరించగా చూచి అక్కిందపడిన రూపాయి యివ్వమన్నాను. అది నాచేతి కందిస్తుండగా అతగాడొచ్చి యీపని చేశాడు. విచారిస్తే తమకంతా అవగాహన మౌతుందిలెండి. దయవుంచండి.

(తెర)

# రంగము— ౩

ప్రదేశము:- కాలవగట్టున చెట్టు; చెట్టునీడలో—

తెరయెత్తగా—వెంకయ్య, రాములు, మంగమ్మ, భూదేవి కనుపిస్తారు.

(వెంకయ్యకు తల గడ్డం పెరిగివుంటుంది. అందరిగుడ్డలు పాతవి, చినుగుపట్టినవి. మొహాలు దైన్యాన్ని పరాధీనతను తెలుపుతుంటాయి.)

మంగ:- యెక్కడి బొగ్గుగుట్ట, యెక్కడి బెజవాడ! నలుగురం పోతే బాగుండును. మీ యిద్దర్ని పంపి నేను బతుకుతాను? మన వూ రొదిలి వచ్చేనాడైనా నాకీ భయము, గుబులు లేదే ?

వెంక:- ఉన్నదంతా వూడ్చిపెట్టుకపోయినా వున్ననలుగురం ఒకచోట వున్నాం కాబట్టి మొలబంటిదుఃఖంలో మోకాటిబంటి సంతోషంగావున్నాము. ఇంకేమున్నది? తెగిపోయిన దండలో పూసలాలె యదా యద లవుతున్నాము.

రాములు:-మీరు దిగులు పెట్టుకోబాకండే! అక్కడ రెండు నెలల్లో కాలుకుదుర్చుకోని వొచ్చి మిమ్మల్ను తీసుకపోతాను!

మంగ:- యీ రెండునెల్లూ రెండేండ్లు కావటా ్రి నాయనా నాపా ్రిణానికి ?

వెంక:- వాండ్లను సాగిపోనీవే! ఉన్నది వుండగా యింకా యేమి బెడదవొచ్చి పడుతుందో? పోలీసులు ఆతీరున కావర్లాడుతున్నారు. ఈ సమయాన మొగం తప్పిస్తేనే మంచిది.

మంగ:- వాండ్లకు ఆడతోడు లేదు కామాల్ను. ఆవిదంగా ఆడకూతుర్ని బంగపెట్టటానికి తలపడి, యింకా రాచి రంపాన పెడదామని యెందుకో? యెంతబస్తీ అయితే మట్టుకు, న్యాయం చెప్పే దిక్కు లేకపాయెనే!!

భూదేవి:- మనబోటి దిక్కులేని పేదవాండ్లకు యెవ్వరూ న్యాయంచెప్పరత్తా. గొప్పవారికి అందరూ చెప్పేవారే! గొప్పవారంటే, మేడల్లో మిద్దెల్లోవుండి, బండ్లలో మోటార్లలో తిరు

గుతూ ఒంటికి చెమట పట్టకుండా బీదవాండ్ల నెత్తురుబొట్లను పిండి యెవరైతే దాహం తాగుతుంటారో వారు గొప్పవారు. వారి పక్షం అందరూ చెప్పేవారే! వారసలు చెడ్డపని చెయ్యరు.

**రాములు:-** మనం యిట్టాగే ఆలోచన్లు పడుతుంటే, ఆరైలు కాస్తా మిగిలిపోతుంది. సావాసంగా వస్తామన్నవాండ్లు దాటి పోతే, ఒంటిరిగాండ్ల మాతాం.

మంగ:- నాయనా! నీవెన్నైనా చెప్పు. నన్నుకూడా తీసుక పోకపోతే నాప్రాణాలు దక్కవు. మీఅయ్య మట్టుకు బింకేని కంటున్నాడు కాని, నీవు కనపడకపోతే గుడ్డికూడేకదూ! (కండ్ల నీళ్లు తుడుచుకుంటుంది)

భూదేవి:- అత్తా! మాకు దైర్నం చెప్పాలిసిన పెద్దదానివి నీవే యిట్ల "ఆవురు" మంటే మాకు అడుగు సాగుతుందా?

**రాములు:-** అమ్మా! నీవు గట్టిగావద్దంటె మానుకుంటాము లేవే! నీవు సంతోషంగా పంపకపోతె, అక్కడ మాత్రం మేము సుఖపడేదేముందీ?

వెంక:- ఇదుగో! వాండ్లు చద్దీ బత్తెం చేసుకొని, మూటా ముల్లె కట్టుకొని, చెప్పుల్లో కాళ్ళుపెట్టపొయ్యేటప్పుడు నీవేంది పిచ్చి మాటలు అడ్డంగా! వాడేం తెలియనోడనుకున్నావా? అడ్డంచెప్ప బాక. వెళ్లిరా నాయనా వెళ్లిరాండి.

రాములు:- (వినటం అభినయించి) అదుగో! నాలుగు కొట్టేరు. ఇక గంటకల్లా అక్కడవుండాలె. (భూదేవివైపుచూచి) నీది కొంత తేమానముందా?

భూదేవి:- నాదేమున్నది? యెద్దులు కదలాలెనా? బండ్లు కదలాలెనా? ఆరాతలు రాళ్లపాలైపొయెగా!

**వెంక:-** అయ్యోవ్! రాములు! నా రెండో కండువాకూడా తీసుకపో.

రాములు :- నీకు గట్టిగుడ్డ అనలేవుండదుగా ?

వెంక :- నాకేంలే అయ్యా ! యెట్టాంటి పేలిక మీదేసుకున్నా తెల్లవారుతుంది.

భూదేవి :- మాఅత్త, పాతచీర యిచ్చిందిలే మామా ! నీది నువ్వుంచుకో.

వెంక :- అమ్మోవ్ ! ఆచీర పక్కనేసుకుందురుగాని—నా కండువాకూడా తీసుకపోండి. ఇదుగో బాక్కీశాలో యేసి కట్టు కరా. (తనపైకండువా యిచ్చును)

భూదేవి :- (తీసుకొని లోపలికి వెళ్లుతుంది.)

వెంక :- (తన కుచ్చెళ్లచెంగు మూటవిప్పి) రాములూ ! ఇట్టారా ! రైలు కర్చులు పోతే మీకు రెండురూపాయలేగా మిగిలేది ! ! ఇదుగో ! యీ రెండురూపాయలు కూడా దగ్గర వుంచుకో. పోంగనే పని దొరుకుతుందని యేమి నమ్మకం ?

రాములు :- అంతమాత్రమన్నా చేకావలి వుంచుకోకపోతే నీకెట్టా జరుగుతుందే ? పనిపడితే నాతో వస్తున్నవాండ్లు సర్దుకుంటార్లే !

వెంక :- అయితే మానెలే అయ్యా ! దగ్గర వుంచుకో ! మరీ కొత్తవూరు. (బలవంతంగా చేతిలో పెట్టును)

(ప్రవేశం—భూదేవి)

**భూదేవి** :- (మూటతోవచ్చి) అత్తా ! మా వాండ్లదగ్గర నుంచి వుత్తరం వొస్తే అక్కడికి మాకు పంపండి.

రాములు :- (భూదేవిచేతిలో మూటతీసుకొని తనకర్రకు తగిలించి బుజాన పెట్టుకొని) అమ్మా ! పోయొస్తానే !!

మంగ :- (కౌగలించుకొని) ఎక్కడికి పోయొస్తావయ్యా ? ఆవుల బేరానికా ? కోడెలబేరానికా ? పెండ్లి పెత్తనానికా ? యీ

అగచాట్లమారి ప్రియాణం నీకెందుకొచ్చింది నాయనా? నేను కూడా వస్తాను పిల్చుకొపో. నీకు పుణ్యంవుంటుంది.

రాములు :- నీవొస్తే అయ్యకు దిక్కెవ్వరమ్మా! అయ్యను కనిపెట్టివుండు. అయ్యా! పోయొస్తానే!

వెంక :- (తలనిమురుతూ) క్షేమంగా పోండయ్యా! మళ్ళీ నా కళ్లకు యెప్పుడు కనపడుతావు నాయనా! (కూలపడును.)

రాములు :- అయ్యా! అట్టా కూలపడిపోయినా వెందుకే?

వెంక :- నాకెందుకో కడుపులో యికారంగా వుందయ్యా!

రాములు :- పోనీ లేవే! యీపయనం మానుకుంటాము.

వెంక :- వొద్దయ్యా, వొద్దు. "సుబమా" అంటా బయలుదేరి నారు. వెళ్లిరాండి నాయనా!

రాములు :- (భార్యను వెంటపెట్టుకొని నాలుగడుగులు సాగుతాడు.)

వెంక :- రాములూ! చేరంగనే కాయితం రాయించయ్యా! లేకపోతే మీ యమ్మ మంచాన పడుతుంది.

రాములు :- (వెనక్కితిరిగి) అట్టాగే లే! డాకటేరుగారి పేర రాయిస్తాలే. (నడుస్తూ భార్యతో) తల్లిముండ మొయ్య... ... నాకూ .. ...కడుపులో... యేందో యిదిగావుందే! ముందుకు నడుస్తున్నానన్నమాటేగాని, వెనక్కి పగ్గాలేసి యేమిటిదో, నూరుమంది పట్టి గుంజినట్టున్నదే!

మంగ :- వొూ అయ్యోవ్! రాములూ, రాములూ! (కేక వేసి చప్పట్లుకొట్టును)

రాములు :- (తిరిగి వెనక్కివచ్చి) ఏందమ్మా?

మంగ :- యేమిలేదు నాయనా...... రైలు యెక్కేటప్పుడు దిగేటప్పుడు జాగర్త.

రాములు :- మరేంపరవాలేదులే అమ్మా! (తిరిగి తిరిగి చూస్తు వెళ్లుతుంటారు.)

మంగ :- (చూస్తూనేవుండి) నాయనా ! రాములూ ! (పరుగెత్తుకొని వెళ్లి కౌగలించుకొనును.)

రాములు :-(కండ్లనీళ్లతో) యేందమ్మా నీ కీపిచ్చి! మళ్ళీ రెండ్రోజుల్లో అందరం ఒకచోట వుండేదానికి ?

మంగ :- (దుఃఖముతో) ఏంచేసేది నాయనా? కడుపులో గాలి దుమారం పట్టినట్టువుంది. టేసన్ టేసన్ కాడ దిగేవయ్యా! పిల్లను నీ దగ్గరే కూచోపెట్టుకో !! అమ్మా, బూదేవీ! జాగర్త తల్లీ !!

రాములు:-వేళఅయిందమ్మా ! ఇక మీరు వుండండి.

మంగ :- యెళ్లిరాండయ్యా ! తిక్కెట్టు పారేసుకునేరు. గట్టిగా మూటకట్టుకోండి.

(రాములు—భూదేవి—నిష్క్రమింతురు)

వెంకయ్య :- (చూచి చూచి కండ్లు మూసుకొని కాళ్లతో కర్రతో బాట తడుముకొనుచుండును.)

మంగ :- (కండ్ల నీళ్లు చెరగుతో తుడుచుకొనుచు) యింక పోదాంరా? అయ్యను, అమ్మను సాగనంపేముగా ?

వెంక -: యింకా చెట్టుకాడికి... యెంతదూరం పోవాలె ?

మంగ :- అల్లదుగో చెట్టు, కళ్లుతెరచి నడు.

వెంక :- (తెరిచి) కళ్లుతెరిస్తే మాత్రం యేం కనవడుతున్నది?

మంగ:- బాట.

వెంక :- బాటకు... అన్నీ... ముండ్ల కంచలేనే. (మంగమ్మ చేయ్యి పట్టుకొనును)

# రంగము—౪

ప్రదేశము:- డాక్టర్ గారి మేడలో వంచపాళి

తెరయెత్తగా, డాక్టర్ భూషణ్, వెంకయ్య వుంటారు.

భూషణ్ :- (ఇంగ్లీషువార్తాపత్రిక చూస్తూ పడక కుర్చీలో వుంటాడు)

వెంకయ్య :- (ప్రక్కన నిలుచోని దీనంగా)... మీ చాకిరి చేసేదానికి యేమీ పసిలేదయ్యా ! నేనొచ్చి శానాసేపైంది. తొందరగా రా అయ్యా !

భూషణ్ :- (పేపరు చూస్తూనేవుంటాడు.)

వెంక :- (చేతులునలుపుకుంటూ రానినవ్వు తెచ్చిపెట్టుకొని) అయ్య పనితో వున్నట్టున్నది. కోపం వొస్తుందేమో ! తొందరగా లే నాయనా ! !

భూషణ్ :- (పేపరుచూస్తూనే మొహం చిట్లించి) ఏమిటోయ్ ప్రపంచం మునిగినట్టు వెధవ కేకలు, చెవిదగ్గిర చేరి యేమి తోచకుండాను ?

వెంక :- మన తెలివిలేదు ; ప్రాణంమీదికి వొచ్చిందండీ !

భూషణ్ :- దాని ప్రాణంమీదికి వచ్చిందని మాప్రాణం పోగొట్టుకో మంటావా యేమిటి ?

వెంక :- అయ్యో ! అంతమాటెందుకండీ ?

భూషన్ :- రాత్రి నే నిచ్చినమందు పోశావ్ మంగికి ?

వెంక :- ఇచ్చానండీ, వడ్లగింజయేస్తే పేలగింజ అయ్యేవొళ్లు నీళ్లకుండ అయింది నాయనా ! కలవరింపులుకూడా అణిగినయి.

భూషణ్ :- రేపు వుదయాన ఆస్పత్రికి రా చూతాం. ఇప్పుడిక్కడ మందులులేవు; పైగా నే నిప్పుడు క్లబ్బుకెళ్లాలి.

వెంక :- అయ్యా ! యింతకఠినమా నాయనా ? ఎక్కిళ్లు కూడా వస్తున్నయే ! సూదిమందేస్తామని ఆశపెడితిరి. మీ అనుమానం యేమిటో చెప్పండి ! యీ పేదరాలి కిచ్చి లాబమేమిటనేరదూ ! యింతకంటె మాకు ఆపదేముంటుంది తండ్రీ ? ఇదిగో ! (తలగుడ్డ చెంగు మూటవిప్పి) దాని పుట్టింటివాండ్లు చేయించిపెట్టిన పైడినల్లలు. ఒక్క తులం బంగారం తేలుతుంది. వీటిని తీసుకొని నా యిల్లు నిలపెట్టండి.

భూషణ -: డాక్టర్ భూషణగారు రోగుల మెళ్లలో సొమ్ములు తెంపిస్తున్నాడని ఇదొక అప్రతిష్ట యెందుకురా నాకు ? నీవే యేమరాబువద్దనో అమ్మమూపి పైకం పట్రా.

వెంక :- దోవలో పూసలుమారుస్తాను. దయవుంచి యిప్పటికైనా బయలుదేరండి.

భూషణ :- "ఇప్పటికైనా" అని ఒక నిష్ఠురమా ? రోగాలు వూరికే వస్తవి గాని మందులు వూరికే వస్తవిటా ?

వెంక :- ఆ మాట నేనన్నానయ్యా ?

భూషణ :- ఏడ్చావ్ఫులే !! సరేగాని—లోపలికెళ్లి బల్లకింద నా కాలి బూట్సువుంటవి. పట్రా.

వెంక :- (తెస్తాడు)

భూషణ - ఇలా నాకాళ్లముందు పెట్టు.

వెంక :- (పెట్టుచుండును.)

భూషణ :- అబ్బే, దుమ్ముకొట్టుకొని డర్టీగావున్నవే! చూడూ; అక్కడనే ఒకపాతగుడ్డ వుంటుంది అందుకో. నేను డ్రెస్సు వేసుకొని చక్కావస్తాను. (లోపలికివెళ్లును.)

వెంక :- (లోపలికివెళ్లి గుడ్డపేలిక తెస్తూ) ఇక తుడవకమాత్రం తప్పుతుందా ? ఔరా ! చావుదలకు యెట్టాంటి గతి పట్టిందినాకు ? (దుఃఖముతో) చేసుకున్న పెళ్లాము గుటగుటలాడుతుంటే,

గొంతులో యిన్నినీళ్ల చుక్కలన్నా వెయ్యటానికినోచుకోక, డాకటేరు గారికాళ్లజోడు తుడుస్తూకూచ్చున్నే గతిపట్టింది. (దీర్ఘనిశ్వాసము)

భూషణ :- (ప్రవేశించి) ఏం, అయిందా? (కుర్చీమీద కూర్చొని) ఇలాపెట్టు.

వెంక :- (కాళ్లవద్ద పెడతాడు.)

భూషణ :- బండి తెచ్చావటోయ్?

వెంక :- లేదయ్యా! మన మోటారుందిగా!

భూషణ :- (తనలో) మనమోటారేమిటి వీడిబొంద? (ప్రకాశముగా) డ్రైవర్ లేడు. నీలాంటి లోఫర్సుతో యిదే పీకులాట. వెళ్లి ఒకజట్కా కట్టోయ్.

వెంక :- అట్టాగేగాని— దాని పత్రేనికి గూడా బొత్తిగా జరగటం లేదు. తమరు రెండ్నెల్లజీతం యివ్వాలె. దయచేయించండి.

భూషణ :- "తలచుకున్నప్పుడే తాతపెండ్లి కావాలె" అంటే యెల్లా కుదురుతుంది? నీ వెయ్యిరూపాయల జీతం ఇవ్వలేక పోములే! ఫస్టుతారీఖు రానీ పారేస్తాను.

వెంక :- పిల్లోడికి సింగిరేణికి కాయితకు రాయిద్దామనుకుంటే చేతులో యెర్రటి యేగాని లేక అడిగేనయ్యా! కోపగించుకుంటే ..

భూషణ :- సింగరేణి అంటే జ్ఞాపకమొచ్చింది. ఈరోజు పేపరులో చదివేను. బొగ్గుపెంకు విరిగిపడి రెండువందలమంది చచ్చేరటే? (సిగరెట్ వెలిగించును.)

వెంక :- (ఆదుర్దాతో) యేందయ్యా, యేందీ?

భూషణ :- మొన్నటిరోజున యేదో బొగ్గుగనిలో పెంకు విరిగిపడి యెవరో రెండువందలమంది చచ్చేరట.

(12)

వెంక :- (డగ్గుత్తికతో) రాములూ, భూదేవి బాగున్నారేమో చూచి చెప్పు నాయనా ? (చతికిలపడును.)

భూషర్ :- పేపర్లో ఫలానావాండ్లని వ్రేస్తుండవు.

వెంక :- (వణుకుతూ) మరెట్టా అయ్యా ?

భూషర :- భయంలేదు పో. ఏగనిలోనో ? ఏ ముఠావాడో ? మీవాండ్ల మాటేనని గుర్తేమున్నది ?

వెంక :- (లేచి వెళ్లబోతూ వైవర్ణ్యమైన ముఖంతో) యింకెక్కడికి పొయ్యేది ? యింకేమి తెచ్చేది ? యింకెవ్వరికి చెప్పేది ? (వెర్రిచూపు చూచి నడుస్తూ పడిపోవును. తెప్పరిలి లేచి) కండ్లు చీకట్లు కమ్ముతున్నయే ! చెట్టుకాడికి మెట్టా చేరేది ? రాములూ ! నన్ను తీసుకపోవు నాయనా ? ఏడీ నారాములూ ? నా వూతకర్ర యిరిగిపోయిందా ? గట్టికర్ర ! నేను బతికినన్నాళ్లు నా చేతికింద దిట్టంగా పడివుంటుందనుకున్నానే ! (పైకిచూచి) రామయ్యతండ్రీ ! యేమి న్యాయంగా పాలిస్తున్నావయ్యా (నడుచుచుండును).

(తెర)

## రంగము – ౫

పరిదేశము :— కాలువగట్టున, చెట్టుక్రింద.

(తెరయెత్తగా, మంగమ్మ, వెంకయ్య కనుపించెదరు)

(చెట్టుక్రింద చినిగిపోయిన గోనెపట్టమీద, మంగమ్మ గుడ్డకప్పుకొని, కండ్లుమూసుకొని పండుకొని యుంటుంది. వెంకయ్య ఆమెప్రక్కన దిగాలపడి కూర్చొని యుంటాడు. అతని చేతి వెంబడి ఒక నీళ్లముంత వుంటుంది.)

మంగ :- ఊఁ ..ఊఁ... (మూల్గును)

వెంక :- (ఆమె మీదికి వంగి) ఏంది, యేమి బాధగా వుంది?

మంగ :- (వినబడీ వినబడనట్లు) రాములూ......మంచె... బూదేవి...

వెంక:- (లేచి ఆవలికి వెళ్లి విషాదముతో) భూదేవిని మంచె మీదికి యెక్కేటట్టు చేశామా ? బతా మెమ్మ కడుపులోకి చేతులార పంపిస్తిమే ?

(కొంచెము యెడముగా కూర్చుంటాడు)

మంగ :- (పండ్లు కొరుకును.)

వెంక :- (లేచి దగ్గరకువచ్చి) పండ్లుకొరుకుతావు ? నామీదేనా ? పండ్లు కొరకటంకాదు; నన్ను పొడిచి చంపినా పాపంలేదు.

మంగ :- రాములు......తిల్లిక...

వెంక :- (ఆశగొలిపే చూపులతో)మనయింటి తిల్లిక యెలుగుతున్నదీ ? నాయనా, రాములూ! మీయమ్మ ఆశె వ్రుదులుకున్నా, వొచ్చి ఆఖరు చూపు చూడవూ ?

మంగ :- (నోరు తెరచి నాలుకతో పెదవులు తడుపును.)

వెంక :- ( ఆమె చెవిలో బిగ్గరగా ) దప్పికా ? దప్పికౌతున్నదా ? ( నీళ్లముంత తీసుకొని, ఆమె నోటివద్ద పెట్టి వణికించుచుండును.)

( ప్రవేశము :- నారాయణరావు, కాఫీప్లాస్కుతో )

వెంక:- ( కండ్లనీళ్లతో తలయెత్తిచూచి ) యెవరు ? ( తల వంచి ముంత క్రిందపెట్టును.)

నారా :- ( తగ్గి తగ్గి) నేను... మన రాముల... సహావాసగాణ్ణికదూ, వెంకయ్యా !

వెంక :- (తలయెత్తకుండ) ఆ... సావాసగాండ్లున్నారా ? (తలయెత్తి తేరిపార చూచి) కర్ణం కాంతయ్యగారి కొడుకువు కదూ ? అమీనాను కూడా తెచ్చావా ? ఇంకా వొదిలిపెట్ట లేదయ్యా మమ్మల్ని ?

నారా :- ( లజ్జా విషాదములతో తలవంచుకుంటాడు.)

వెంక:- చెట్టుకొకరం గుట్టకొకరం అయి, యీగతి కొచ్చాము. చచ్చిపోతున్నా సాధింపు లెందుకు నాయనా ?

నారా:- (దీనంగా) మీరు చిరంజీవులు వెంకయ్యా! మన దేశంలో మీపేర్లు స్థిరంగా నిలిచివుంటాయి. చచ్చిపోయిన వాండ్లము మేము. మీ కుటుంబం మాకుచేసిన మేలుకు, మే మెంత కీడైనా చేశాము. నిజంగా నగం చచ్చే నీ దగ్గరకు వచ్చాను. మాతప్పుల్ని మన్నించు.

వెంక:- యేందో మీమాటలు నాకు తెలియటంలేదు. దీని గొంతులో నీళ్లచుక్క లెయ్యాలె. కూచోండి.

నారా:- మంగమ్మకొచ్చిన భయంలేదు వెంకయ్యా! దిగులు పడబోకు.

వెంక:- ఇంకా భయమెందుకు ? అన్నిభయాలు తీరినట్టే !

నారా - ఈ కష్టాలమూలాన నీవు పుటంపెట్టిన బంగారమయ్యావు.

వెంక:- పుటం...ఫుటం .. కాంతయ్యగారు, శాస్త్రుర్లగారు, పున్నయ్య బాగున్నారుకమా ! వారికి నా దణ్ణాలుచెప్పండి! కూచోండి; యెందుకొచ్చారు మీరు ?

నారా:- (వంగి, వెంకయ్య రెండుచేతులు పట్టుకొని) తప్పు పని చేశాము. నీ నోటిముందరి అన్నం తీసివేశాము. ఇప్పటి రాజకీయపరిస్థితి, గ్రామపరిస్థితి, మేము, అంతాపోగై నిన్నీగతికి తెచ్చాము. "జరిగిపోయినవి, క్షమించాను" అని అను. ఆమాట అంటే నింపాదిగాకూర్చొని మాట్లాడుతాను. ఇవి చేతులుకావు కాళ్లు.

వెంక:- యేందండీ యీపని ? యింటికైంది యీ తీరుగా వుంది. గొంతులో గంజిపోసే కొడుకును కోడల్ని బాగ్గుగని కొప్పచెప్పి, మొండిప్రాణంపోక కొట్టుకుంటుంటే...

నారా:- మన రాములూ, భూదేవీ యిద్దరి క్షేమసమాచారం నేను తెచ్చాను. సింగరేణిలో సౌఖ్యంగా వున్నారు.

వెంక:- (జాలిగొలిపే చూపులతో) నిజమేనా అయ్యా?

నారా:- ఇంకా అబద్ధాలతోనే బ్రతకాలెనా నేను. ఇదుగో టెలిగ్రాం. (జేబులోనుంచి పైకితీసి) "రాములు భూదేవి, సౌఖ్యంగావున్నారు. రోజుకు రెండురూపాయలు సంపాదిస్తూన్నారు'' అని ఇంగ్లీషులో వున్నది.

వెంక:- (దీర్ఘనిశ్వాసముతీసి) అమ్మయ్యా! (కండ్లుమూసికొని గుండెపై చేతులు అదుముకొని) ఆరిపోయ్యే దీపంలో ఆముదపుచుక్కలు వేశావు భగవంతుడా!!! ముందీ మాట దానిచెవున వెయ్యి నాయనా?

నారా:- ముఖ్యంగా వేస్తాను. (మంగమ్మ ప్రక్కన కూర్చొని చెవులో) అమ్మా ... మంగమ్మా ..మనరాములు, భూదేవివద్ద నుంచి వుత్తరం వచ్చింది.

మంగ:- (కండ్లు తెరిచి ఆశతో) ఆ ...

నారా:- నీకొడుకు కోడలూ బాగావున్నారు. ఎల్లుండి వస్తారు.

మంగ:- (నోరుతెరిచి నాలుక జాపును)

నారా:- నాలుక చూపిస్తున్నది. తడిలేదుకాబోలు. ఈ వేడి వేడి పాలు గొంతుకలో పోస్తాను.

(ఫ్లాస్కులో పాలు నెమ్మదిగా జారవిడుచును.)

మంగ:- (గుటకలువేయుచుండును.)

వెంక:- వాండ్లెందు కిచ్చారయ్యా యీ తంతె?

నారా:- నేను నామిత్రుడు డాక్టర్ భూషన్ గారింటికి వచ్చాను ముందు. మీకు కలిగిన కష్టాలు అతనివల్ల తెలుసుకున్నాను. సింగరేణిలో జరిగిన అపాయం మాటకూడా అక్కడే విన్నాను.

మన వాండ్లు పనిచేసే గనియజమానికి వీండ్ల క్షేమం తెలుపవలసినదని అక్కడి కర్చుకూడా యిక్కడేయిచ్చి వెంటనే తంతికొట్టించాను. ఈ జబాబు వచ్చింది.

మంగ:- రా...ము...లు...వ...స్తా...డా?

నారా:- మాపటికి నేనువెళ్లి యెల్లుండి పిల్చుకొని వస్తాను.

మంగ:- (కండ్లు తెరిచి) యెవరు... నీవు?

వెంక:- కర్ణం కాంతయ్యగారికొడుకు నారాయన్‌రావు కదూ!

మంగ:- (కండ్లుమూయును.)

నారా:- (సిగ్గుతో) కండ్లుమూసింది; నామొగం చూడటానికి ఆమెకు ఇష్టంలేదు.

వెంక:- మన కీ చల్లటి కబురు తెచ్చింది యీ మారాజే!

నారా:- మనిషని వుంటే తప్పుచేయకుండా వుండగలడా అమ్మా? దాన్ని యెల్లకాలం మనస్సులో నీయంటి తల్లికూడా పెట్టుకుంటె యట్లా? మన్నించు మంగమ్మా!

మంగ:- అయితే... పిల్లలు... నిజంగా... వస్తారా?

నారా:- తప్పకుండా వస్తారు. ఎల్లుండి నీకు కనుపడుతారుగా!

మంగ:- యెల్లుండి .. యెప్పటికి... వొస్తుం దబ్బా!

నారా:- రే పొక్క రోజే లేనిది— నీకు బాధేమిటమ్మా?

మంగ:- (గొంతుచూపును.)

నారా:- గొంతుకలో తడిలేక మాట రావటంలేదు (పాలు పోయును.)

మంగ:- (పాలుత్రాగి ప్రక్కకు వత్తిగిలి) ఒళ్ళో... నొప్పులు.

నారా:- ఒళ్లునొప్పులా అమ్మా? ఇప్పుడే వెళ్లి తగినమందు

తెచ్చిస్తా వుండు. వెంకయ్యా! మమ్మల్ని మీరు క్షమించినట్టే కదూ?

వెంక :- అంతమాటయెందుకు? మాపెద్దల్ని మీరుచంపేరా? మీపెద్దల్ని మేము చంపేమా ?

నారా :- మీకు రాములొకటి, నేనొకటీకాదు. పెద్దవాణ్ణి నేను ; చిన్నవాడు రాములూ నని యీరోజునుంచి నమ్మివుండాలి.

వెంక :- అట్టావున్నమాట నిజమేగా చిన్నప్పుడు ?

నారా :- నేనొక కోరిక కోరుతాను. దాన్ని మీరు తీర్చాలి.

వెంక :- చెప్పండి ; నాకు చేతైతే ......

నారా :- మీరందరూ నాతో మనవూరికి రావాలి.

వెంక :- యేమున్నదని ?

నారా :- కావలసిన దంతా వుంటుంది.

వెంక :- "కలిపోసి పెట్టినా పుట్టివంకచూచి" నట్టు వుంది.

నారా :- కాదు. నీకు తెలియలేదు. ఊరి స్థితి మారింది.

వెంక :- పట్నంలో పావలాడబ్బులు సంపాయించుకుంటూ యెప్పుడైనా పుట్టిపెరిగిన వూరికి రాకుండా, నావల్ల వూరికి పగవాడివి అవుతావు.

నారా :- పగవాణ్ణికాను, పరమ ఆప్తుణ్ణి అవుతాను - నేనిప్పుడు పట్నం కాపురం మానుకొని, మన గ్రామంలోనే మీతోపాటు వుంటున్నాను. మిమ్మల్ని పిల్చుకొనెడదామని నేను వస్తుంటె, ఆనాడు రాములవారికోసం వచ్చిన భరతుడితో, అయోధ్య ఆబాలగోపాలం కదిలినట్టు మన గ్రామమంతా నాతో కదిలితేను, కష్టంమీద వాండ్లను ఆపి నేనెట్లాగో ఒక్కణ్ణి వచ్చాను.

వెంక :- అక్కడ మాకు బతుకు తెరువేమున్నది ?

నారా :- మీ యాస్తే!!

వెంక :- కక్కిన కూటికి ఆశించేదా ?

నారా :- వాండ్లకై వాండ్లేయిస్తారు.

వెంక :- దానం పట్టటానికి నేను బ్రాంబణ్ణికానుగా !

నారా :- దానమేముంది; బాకీలోకి సేవిచ్చిన చెల్లులు నిజమైనవి. అదిగాక వడ్డీ ధర్మంగాకట్టాలి. ఈ ప్రకారమైతే నీబాకీ యెంతవుంటుంది గనుక. ఇది గ్రామమంతా కలిసి యేకగీవ్రంగా చేసినధర్మనిర్ణయం. అందుకు వాండ్లు సంతోషంగా వప్పుకున్నారు.

వెంక :- యేమోనండీ ! నామనస్సుకు కుదురుపాటు చిక్కేటట్టులేదు. కొండ్రిను, కొంపను కోలుపుచ్చటం అట్టావుండగా, బిడ్డకంటె యెక్కువగా సాక్కుంటున్న గొడ్డును, నాముసలి బసవదేవుణ్ణి వకయ్యకు వప్పగించి (కండ్లనీళ్లతో) గోడు గోడు మని యేడుస్తూ గ్రామం వదిలిపెట్టివచ్చిన నాటిమాట గొంతులో వూపిరి వుండగా మరుపుకువస్తుందా ? దాన్నితలుచుకొని వలవల యేడవని రోజులేదే !! (దుఃఖించును.)

నారా :- నీ మునసెద్దు నీకోసం బెంగపెట్టుకొని వున్నది. "వెంకయ్యా ! వెంకయ్యా" అని పిలిస్తే తలయెత్తి దిక్కులుచూచి చెవులు ముందుకు నిక్కపెట్టి, నీజాడ లేకపోవడంచేత కాబోలు, తలవంచి కండ్లవెంట బొటబొట నీళ్లు విడుస్తుంది వెంకయ్యా !

వెంక :- అయ్యో ! నాయనా !! (కండ్లుమూతలుపడి నేలపై కొరుగును)

నారా :- (దగ్గరకూర్చొని పైపంచెతో విసరుతూ ఉపచారంచేసి కూర్చుండపెట్టి) నాయనా ! దుఃఖపడబోకు. నీవంటివాడు దుఃఖిస్తే దేశానికి కీడు తప్పదు. నాతో రా. మళ్లీ నిన్ను చూస్తే నీయెద్దు యప్పటివలె దిగులు తీరి వుంటుంది.

వెంక :- మరేనండి. నేను వచ్చినంత మాత్రాన దేశానికి కీడుతప్పుతుందా ? నాబోటివాండ్లు యీ దేశంలో యింకా యెంత మంది వున్నారో ? యెంతెంత బాధలు పడుతున్నారో !

నారా:- అటువంటివారినీ అందరినీ వుద్ధరించటానికి, దేశంలో అహర్నిశాలు ప్రియత్నములు జరుగుతున్నవి. ప్రియత్నములు ఫలించే లోపల యెంత సంక్షోభమైనా కలుగవచ్చును. అది నైజం. అన్నం పక్వానికి రాజోతున్నది. అందుచేతనే యీ కళ పెళలు. తూర్పు తెల్లవార బోయ్యేముందు చీకట్లు అధికం కావటం, వర్షానికి ముందు గాలిదుమారం రావటం నీవెరుగవు?

వెంక:- సరే. రాముల్నికూడా రానియ్యండి. కలిసి మాట్లాడుకుందాం.

నారా:- కృతార్థుణ్ణి నేనిప్పుడు నిజమైన న్యాయవాదినని గర్విస్తున్నాను.

(తెర)



# అయిదవ అంకము

## రంగము—౧

ప్రదేశము:- గ్రామవీధి

ప్రవేశము:- మహామత్ ఖాన్ సాహెబు, లక్ష్మయ్య.

మహా:- యీ మద్ధెంలో నీదర్షణం కన్పడ్డూ, యేఖ్ఖీ అండీ లత్మ్మాగారూ ?

లక్ష్మ:- చూస్తూనే అట్లా అడుగుతావేమిటి ? వెంకయ్యా వాండ్లూ వచ్చింతరువాత యెవరికి తీరుబడియేడ్చింది ? ఉగ్గం-ఉగ్గం తప్పితే మగ్గం అన్నట్టు ప్రతివాడికీ యెప్పుడూ ఏదోక వృత్తిపని; అదితప్పితే గ్రామసేవ. వీటితో సతమతమౌతుంటిమి.

మహా:- నారన్ రావుసాబ్ బిజ్వాడానుంచి రాముల్ ఫ్రేండ్లకి తెచ్చింతర్వాత, బల్ ఘుశ్ బిశ్ చేస్తావుండారూ అండీ, ఆన ఆన భారాగాపూ !

లక్ష్మ:- వారు హడావుడీమనుషులు కానేకారే!

మహా:- మీాకి సూచిచెప్పేరు ? లేదూఅండీ ? మూా ముసల్ మాన్ కొంపల్లో ఆనా భారాహైనై కష్లీా అమ్మాగారూా, [illegible] పడ్డా, మెత్తామెత్తా మాటల్ చెప్పుంటూ, హిప్పుశ్ మూా బూబుల్ ముస్కుల్‌కి తీపిచ్చిందిగా అండీ! గురఖాతీపించి రాటంకాడా కూకోపెట్టి యేకేక్ రోజూకీ బేడాబేడా-తీన్ ఆనే- నశీబ్ ఖులా యించిన రోజు పావ్లాపావ్లా, తిన్ పిస్తావుండాదికదూ అండీ ఆ అమ్మా గారూ! మంచాల్కీ- నభార్ నేపిచ్చి పైకి పంపిస్తావుండాదిగా!! ఖైరాతీగా గదిల్లో కూకోని తెల్లపడ్డా బూబుల్, పనీచేసి పొట్టల్ నింపుకుంటూ హిప్పుశ్ పచ్చాపడ్డారుగా అండీ! యెంతా ఘుశ్ బిడా చేస్తే యింతా హుష్కారం జర్గాలా అండీ, మహారాజ్ !

లక్ష్మి :- మీ ఆడవాండ్లకుగూడా విద్యాబుద్ధులు చెప్పించి, సభావేదికలమీదికి రప్పించి మహత్తరమైన దేశసేవ చేయిస్తారు నారాయణరావుగారు. ఆయన యెటువంటి మార్పులు తెచ్చి పెడుతున్నాడో చూచావా ? పూర్వం ఆయన చదువుకున్న కుంటి శాస్త్రిగారిబళ్లో యిద్దరు క్రొత్తపంతుళ్లను పిలిపించి యేర్పాటు చేశారు. వృత్తివిద్యలు నేర్పుతున్నారు. ప్రతివిద్యార్థి చాప లల్లటమో, ఆసుపొయ్యటమో, రంగు లద్దటమో, వడ్రంగమో, కమ్మరమో, జొరబడి యేదో ఒకటి నేర్చుకునేట్టు చేశారు. ఇక మన గ్రామంలో తిండికి యిబ్బందిపడే ప్రాణివుండదు. ఇక మనపని మూడుపూలు; ఆరుకాయలు.

మహా :- ఏంమ్టో అంటావుండారు కానీ, నాకీ వక పీకుడ్ పడ్డాదీ అండీ, మోత్వాలో. మీకీ "ఒ-న-మ" లు మాకీ "అలీఫ్, బే, పే" లు హాజామత్ చేపిస్తావుండామూ యేమీ! అని.

లక్ష్మి :- వీటినుంచి చదువు బొత్తిగా సున్నాచుట్టేరనేనా నీ అభిప్రాయం ? పిల్లలకు పదిపన్నెండేండ్లు వచ్చేసరికి కావలసినంత చదువు కొంత ప్రపంచజ్ఞానంతో సహా యేర్పడుతుందట.

మహా :- "వర్బాటీ సుఖం" పెట్టేరూ అండీ ?

లక్ష్మి :- ఏమిటి ? . పరపతి సంఘమూ ? ఆ... ఏర్పాటు చేశారు. దానిమాట వచ్చినప్పుడు వెంకయ్య యేమన్నాడో విన్నావా ? "వెనుకటి రోజుల్లో యే బంధువుడి యింట్లోనో, యే స్నేహితుడి యింట్లోనో పెండ్లి అయితే, రైతు వెళ్లి కనీసం ఒక రూపాయి చదివించి వచ్చేవాడు. అందరి యిండ్లల్లో పెం డ్లిండ్లూ ఒక్కనాడు జరుగవు కాబట్టి యెప్పటి కప్పుడు వాడి శక్తిని బట్టి సులభంగా సంతోషంగా వీలైనంత డబ్బు సమకూర్చుకొని చదివించి వచ్చేవాడు. ఆ పైకం కేవలం బాకీక్రిందనే పరిగణింప బడేది. కాబట్టి తనయింట్లో పెండ్లయినప్పుడు చదివింపులు అందు కొనిన, అందుకోతగిన, ఏ వందమంది చుట్టాలో, అయాచితంగా

కొన్ని వందలకు చదివించి పొయ్యేవారు. అట్లాంటప్పుడు పెండ్లిండ్లకు రైతు ఋణం చెయ్యవలసిన పనేముంటుంది? ఇట్లాంటి దివ్యమైన పద్ధతి లేకుండాపోయింది. ఒకరికి ముగ్గురి సంతానాలు కావలెనని కోరే యీ పరపతిసంఘాలు యెన్నైతే యీ పద్ధతికి సమానమౌతుంది?" అని ఆక్షేపించాడు.

మహా:- యెంకాఆగారు పైకి కనపడ్డాగాని కడుప్పాలో బడాబడా వూహాంలు వుండాయండీ!

లక్ష్మి:- రాములూ భూదేవీ గ్రామాన్ని యెంత పరిశుభ్రముగా వుంచుతున్నారో యెరుగుదువా?

మహా:- నీరాటీ రేవుల్ కాడా, యీధుల్ మీంద వుండే అసింగం వూడుస్తావుండారుగా అండీ! యిది అంతా నార్క్ రావూ ఆనాభారాగారి వల్లాఅండీ! మన్కీ ఆన గాంధీజీ అండీ!!

లక్ష్మి:- ఇప్పుడు హరిజనులు మన నీలాటిరేవులకు నిరాటంకంగా వస్తున్నారు. ఇది యింకా సంతోషింపతగింది కమా?

మహా:- కమ్లీ అమ్మాగారూ రైతుల్ చేస్తావుండే జాతర్ నిలుపూ చేపిస్తారంటగా! ఏలాటా అయితాది యేమో?

లక్ష్మి:- ఎప్పటికీ కాదు. వారేపనిచేసినా యెదటివారిని సంతోషపెట్టి చేస్తున్నారు గాని, కష్టపెట్టి చెయ్యటంలేదు. గ్రామంలో బంగారంఅమ్మవారివద్దా, పశువులమేపు బండ్లకు బండ్లు పరాయిగా అమ్మవారివద్దా వెంకయ్య యెంత నైతరంగా పికెటింగు చేస్తున్నాడని చెప్పేది?

మహా:- అయినా బోలో? యెంకా కూ గూడా యిస్మంటీ పనుల్ అంటే వొప్పుకుంటాడు అన్నమాట. యీటీకి ఆమహారాజ్ కూడా హైరాన్ పడ్తావుండాడు?

లక్ష్మి:- సరే; అసలు ఆయన ప్రవేశించనిదే గ్రామంలో యేపని నెరవేరుతుంది? ఆయన ఆడిస్తుంటే 'ఆడేబొమ్మలే తక్కిన

వన్నీని. పెద్ద నోరుపెట్టుకొని కేకలువెయ్యడుగాని, ఆయనకు తెలియని ధర్మం వున్నదా ! పైగా ఆయనమాట సుగ్రీవాజ్ఞకదూ!!

మహా:- అనా పాతామర్ మీకదా ? యీ కొత్తా పద్ధతుల్ కీ యిష్టంపడ్డాడు అబ్బా ?

లక్ష్మి:- పాతవాడైతేనేమి ? కాలాన్నిబట్టి బుద్ధిని మార్చుకునే నేర్పు ఆయనకున్నట్టు యెవరికీలేదు. ఆయన సలహా లేనిదే యేపనీ జరుగదు.

మహా:- అచ్ఛా ! అచ్ఛా ! ఆయనీక్ తల్చుకుంటే మాదీ వళ్లూ వుప్పీక్ పైకీ పొంగిపోతావుండాదీ అండీ ! వక్టీ నాకీ బల్ ఖుషీగావుందీ అండీ! హిమ్మంటీమహార్ బాహూదూ కన్క్ నే ఆయర్ షంసారం నిల్ పెట్టిందాకా నార్ రావు నిద్రాపొయ్యాడూ? కాంతా ఆకి నిదర్ పోనిచ్చాడు ? దేఖో ! లక్ష్మా ఆ హాజరత్ ! వారు రెంకూ మనుసుల్ మన్కి రెంకూ నేత్రంలూ అండీ! యింతకీ, మన హాదరోష్టం కుళ్ళిందీ లేంకీ !!

లక్ష్మి :- ఇంకా బాగా కుళ్లలేదులే ! ఒకరైతు యెత్తుపడ్డ యెద్దును కోత కిస్తున్నాడని వారికి తెలిసింది. నన్ను చూచి రమ్మని పంపేరు. కనుక్కొని వారికి తెలియచెయ్యాలి ! వెళ్లుదాంరా.

(నిష్క్రమింతురు)

## రంగము—౨

ప్రదేశము :- యెద్దులకొట్టము ముందు, మెల్లా.

ప్రవేశము :- బాలయ్య, మాదిగపోలు.

పోలు :- సుబత్తమా అంటూ యిత్తుంష. తీసుకోదొరా ! యింతకంటె పెద్దదర రాదు దానికి.

బాల :- దాని నిలువుచూసి చెప్పరా ! కొట్టమంతయెద్దే !! మూడు మోటబొక్కెన్లుకావ్వా, దానితోలు ?

పోలు :- వ్రాయి దేముడో! అవి యెద్దనుకున్నావా యేని గనుకున్నావా అయ్యా? తోలంతా మొరుసుకపోయి పడక మచ్చలుపడి పాడైపోయింది. అంతా పారుపొయ్యేదే ఆడ. సరీగా నాలుగు సెప్పుల జోళ్లయ్యేది నిజమేనా? యీగో! పట్టండి రెండ్రాలు. సగినమేళ యిత్తుండ తీసుకో!

బాల :- ఇంకొక మూడా కలేసియిచ్చి దాని మెడకు పలుపు పెట్టు. కొమ్ములమీద మొముకలమీద కొంతసొమ్ము తేలుతుందిలే!

(ప్రవేశం—నారాయణరావు, వెంకయ్య.)

పోలు :- దండాలండీ నాన్నయ్య దొరగారూ!

నారా :- పదివేలు, ఏమిటో బేరాలుచేస్తున్నారు?

పోలు :- మాకాపుది యెత్తుపడ్డగోద వకటుంటేను దాన్ని బాగుచెయ్యమని నన్ను పిలిపించిండు. రెండ్రాలకియ్యమని నే నంటావున్నాను. యింకొక మూడకట్టుకోమని ఆయనంటావుండాడు. మారాజులు మీరు యేళకే వచ్చింద్రు. తెంపు సెయ్యండి.

నారా :- (పక్కకుచూచి)అదుగో ఆ పడుకున్న యెద్దునేనా బేరం చెప్పుతున్నది? అయ్యో! బుద్ధెట్లా పుట్టిందోయ్ బాలయ్యా కోత కివ్వటానికి నీకు? నిన్నూ నీ పిల్లల్నీ యిన్నాళ్ల వరకూ బ్రతికించిన బసవన్ననే కదూ కోతకు బేరం చెప్పటం? బసవన్న అంటే ఎవరో యెట్లాంటివాడో రైతుబిడ్డకు నీకు తెలియదూ?

గోమహాలక్ష్మమ్మ - కూరిమికొడుకు
ఇలదున్నుకొనువారి – యింటికొ దిక్కు
అధికారి శంకరుం – దండ భూదేవి
చాలుతప్పక పరి - శ్రమ జేయుజీవి
వందించు గింజల - పరులకు నిచ్చి
గడ్డితా తినుచుండు - ఘనమగు త్యాగి

ఇతని యింటను బుట్టు - యింతు లందరును
పుట్టు ముత్తైదువులు - పుణ్యశాలినులు
కొమ్ములుండిననేమి - గుణబంధురుండు
ప్రేమస్వభావుండు - వేర్బసవన్న!

వెంక :- బాలయ్యా! పండంటి రైతుబిడ్డవే! చూస్తూ చూస్తూ యెంతటి పాపానికి వొడికడుతున్నావురా!!

బాల :- మరేం చెయ్యమంటావే? పొద్దుపూటలు దాని కొలువుకొలవలేక చావు మరణ మొచ్చి కూచున్నదే! యెద్దెంత మేత నవతలో వున్నా నగ పెద్దదైపాయెను. లేవనెత్తటానికి పూట పూట పదిమందిని యెక్కడ పోగుచేసేదే? ఒక్కనాటిది గనకనా?

నారా:- విసుక్కుంటే ఎట్లా? ఎన్నాళ్ళయినా కష్టపడాలి. రేపు మనకేదైనా వల్లతప్పితే మనపిల్లలిట్లా చేయవలసినదేనా?

వెంక :- బాలయ్యా! కుంటివో గుడ్డివో వాకిటి ముందర నాలుగు గొడ్లు వుండబట్టే నీ కింత పరపతిపుట్టి నీ అక్కర్లు గడుపు కుంటూ, నీ వొక రైతుబిడ్డవనిపించుకుంటున్నావు. అవి తొలిగిన మర్నాడు నీ దశ తొలగినట్టేకదూ? ఒక్కమాట చెప్పుతాను విను. ఇంట్లో పిల్లలగోడు కంటె, వాకిట్లో పసువులగోడు యెక్కువైంది. కాబట్టే "ఆలగోడు—బాలగోడు" అన్నారు. పసువులమాట మొదట చెప్పింది యెందుకనుకున్నావు?

బాల :- యెట్లానే మరి? గుర్రం గుడ్డిదైనా దాణాకు తక్కువ లేకపాయెను. వొక వామైతేనేగాని దాని ఆకలిమంట చల్లారక పాయెను. యోణ్ణుంచి తెచ్చేదే? పిల్లల పొట్టలు నిండకనే యేడిచేరోజుల్లో.

వెంక :- చెపితినే! అందరూ పస్తువండుకొని వాటిని బతికించుకోవాలె. "గొడ్డు—బిడ్డ" అన్నారు. బిడ్డకంటె గొడ్డునే ముందు

విచారించాలె. అది నీయింట్లో పుట్టి నీయింట్లో పెరిగింది. ఇంక దాని కష్టమంటావా ? ఉప్పుకూ, చవిటికి దాన్నే చాదినవాడికి నీకు గుర్తు లేదు ? నీ పిల్లలూ పెద్దలూ దాని కష్టం తినికదూ బతికింది. అట్లాంటి బసవదేముణ్ణి కటికోడికైనె మాదిగింటికి కొయ్య పెడతానా? ఇట్లాంటి అపరబుద్ధులు రైతుల్లోనే పుడుతుంటే లోకం యేమి మనాయిస్తుంది ?

పోలు :- యీ యెండకాసే యేడుకోట్ల బూమండలంమీద జరుగుతుండె పనేలేయిది యెంకయ్యదొరా ! తెట్టతెరువుగా మేము తెచ్చిపెట్టిందికాదు. యెనకటి సత్తెకాలంలో మాత్రం మేతనవతనపడ్డ గోదల్ను యేమిచేసినా రనుకున్నరు ?

నారా :- పిచ్చివాడా ! వెనుకటి రోజుల్లో పశువులకు తిన్నంత మేత. "నవత" అంటేయేమిటో అవి యెరుగవు. వాటి ఒంటి మీద యేమాత్రమైనా మిసమిస తగ్గినట్టు కనిపిస్తే ప్రజలు ప్రభువులుకూడా విలవిల్లాడేవారు. దేశసౌభాగ్యం తగ్గుతుందని గోలెత్తేవారు. వాండ్ల పశుప్రేమ, పోషణ, తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది.

భారతీయులు బాగ - బ్రతికిననాడు ;
ఉడుకురక్తములోన - యుత్తేజమిమిడి
తనువులో రణగుణ - ధ్వని చేయునాడు ;
పసుపు కుంకుమ పెట్టి - భారతమాత
గోజాతి నింటింట - కొలిచిననాడు ;
ధరణీపతులయొక్క - ధర్మహస్తముల
బసవని వంశాలు - వర్ధిల్లుకొరకు
అడవి మాన్యముచేసి - యర్పించునాడు ;
గోపాలకృష్ణుండు - గోపకుల గూడి
చలిదియన్నముగట్టి - నెలగోలబూని

బృందావనమున గో-బృందాలమేపి
కదుపుల దృష్టి నా-కర్షించులీల
వంశనాళంబును - బలికించునాడు;
ఖడ్గతిక్ష్ణన్నయు - కాటమరాజు
ఒరలోన వస్తున్న - యుక్కుకత్తులకు
పాలేటియొడ్డున - భక్షింపుడనుచు
పలల ప్పుష్పాన్న వం - ర్పణచేయునాడు;
బసవన్న యెంతగా - బలిసియున్నాడొ!
వైస్రావాలు యీగలు - పట్టును దప్పి
జర్రుజర్రున యెన్ని - జారిపడినవియొ!!
దేశకళ్యాణముకు - దేహమర్పించి
అనుభవించినదెంత - యానందమౌనొ?
సాకి రక్షించు సం - సారంబు లెన్నో?

పోలు :- దొరగారూ! మనం మనుసులమైతిమి. అయి పసరాలైపాయెనే. "బసవన్నా" అంటా రేందండీ? అన్నవరసెట్లయిద్ది?

వెంక :- నేను చెపుతాను విను. బూమెమ్మకు యిద్దరు ముద్దుబిడ్డలు. పెద్దవాడు బసవడు; రెండోవాడు రైతు. ఇద్దరూ ఆతల్లివంట్లో సత్తా పిండుకొని తాగి బతికేవాండ్లే! ఇద్దరూ పుట్టంగనే నీ వొళ్లోనే పడ్డాం, నీపాలే తాగి బతికేం, చివరకు నీలోనే కలుస్తాం "అమ్మా" అని ఆమెను నమ్ముకున్న బిడ్డలే! ఇద్దరూ ఆమెకోసం సతెన్న రోజూ చెమటబొట్లు చిందకొట్టుకునే బిడ్డలే! అయితే, యిద్దర్లోనూ ముందు ఆ అమ్మ చేతికి అందినవాడు, ఆమెను యెప్పుడూ యెడబాయకుండా ఆమె పక్కలోనే పెరిగిన వాడు బసవడు. వాడు పుటక్కు బుద్దికీ కూడా పెద్దవాడు. పెద్దవాణ్ణి చిన్నవాడు "అన్నా" అని పిలవడూ? అట్లాంటి బసవన్న మన

రోజుల్లో యెట్లా అయిపోయినాడో చూడు. కడుపు తరుక్కుపోతున్నదే !! (విషాదము)

నారా :- నిజం. బసవన్నకీకడాగండ్లుయీనాడు సంభవించినవే!

“ బసవన్న బీళ్లన్ని - పరులకుజేరి
బసవని పోషించు - ప్రభువులులేక
పొట్టనింపుటకింత - పూరియేలేక
కడుపులో పేగులు - కాటుకబట్టు
కాయంబు శుష్కించి - కండలు తరుగ
కనులు గుంటలుఁపడి - కాళ్లూచబార
శివలింగమును బోలు - చెండెండిపోగ
బలిసిన గంగడో - ల్పలుచనగాగ
మెరుగు లీనెడి మేని - మిసమిసల్ తగ్గ
నల్లకప్పతో యొడల్ - గుల్లయైపోగ
జోరీగ లొడలిని - జుమ్మున ముసర
బసవదేహం డెత్తు - పడిపోయినాడు ;
బలవంతప్పతిబారి - పడుచునున్నాడు.

*       *       *

భారతీయులవలెనె - బన్నాలఁ బడుచు
గంజినీటికి గూడ - గతిలేని యయ్యు !
వల్లకాటికిని కా - వలి గాయు జియ్యు !
రావోయి శంకరా ! – రావోయి తండ్రి !
మనయాప్తమిత్రుండు – మనయింటి బంటు,
మనజీవ జీవంబు - మన వాహనంబు,
మనయండ జూచుక - మనియున్నవాడు,
బసవన్న శుష్కించి – పడిపోయినాడు.

ఏ వాహనము మీద - యెక్కి రాగలవు ?
కాలినడకనె రార - కష్టానికోర్చి. ''

వెంక :- కళ్లల్లో నీళ్లచుక్కలనేవి వుంటే, వాటిని యిడవటానికి, యింతకంటె సమయంవున్నదా ? దేశానికి కీడు తేబాకండి. మన కున్నబండారం యీపశుధనమే! దాన్ని యీతీరావ చేస్తే దేశం నాశనమే. నాకంటే మీరు చిన్నవాండ్లు-అయితేమానె, మీకు దణ్ణంపెట్టి బతిమిలాడుకుంటాను. ఈపని మానుకోండి (అంజలి).

పోలు :- అయ్యో నాయనా ! నువ్వు యీపనిసేస్తే మాకు కళ్లాకాళ్లావుంటయా ? పొరనపడ్డా. రచ్చించండి. నీమాటలు ఆయన పాటలు యింటావుంటే నాకడుపులో సెయ్యిపెట్టి కెలికినట్టయింది. బుద్దొచ్చింది. ఇదుగో ! సెంపలేసుకుంటున్నా (లెంపలు వాయించుకొని) అయ్యోయ్ ! యీబూమెమ్మనుకొట్టి బాససేస్తుండా. (భూమిని చేతితోకొట్టి) నా గొంతులో వూపిరుండంగా ఇంక యీపనికి పాలుపడను. నేనొక్కణ్ణేకాదు. మాపాట్లో యిదే కట్టడిసేస్త. రచ్చించండి. (అంజలి)

వెంక :- యేం బాలయ్యా ! నీవో ?

బాల :- తలయెత్తి మీతట్టు చూట్టానికి సిగ్గవుతున్నదే! నాకంటే తక్కువోడు ఆయిదాన చెప్తుంటె నేనేమని మళ్లీ యీపనిచేస్తానే ! ఇదివరకు యింతమాత్రంచెప్పేవాడులేక చెడిపోయినాము. ఇక వొకపనిచేద్దాం. మనవూళ్లోవున్న, గుడ్డి కుంటి యెత్తువడ్డవి యిట్టాంటి పసువుల్ని బరించలేనివాళ్లదగ్గర నుంచి తీసుకోని వాటికొక దొడ్డికట్టించి, అందులోవుంచి, వూరి మొత్తాన కర్చుపెట్టిపోసిస్తుందాం. యీ మాట సాటింపు చెయ్యమని యిప్పుడే మన పోలును పంపుదాం.

(నిష్క్రమింతురు.)

# రంగము—౩

## ప్రదేశము — గ్రామదేవతగుడి

తెరయెత్తగా—దేవతపూజారి, కుమ్మరి; సుద్దులుచెప్పు బైనీళ్లు; గణాచార్లు; గ్రామములోని కొందరు రైతులు; మాదిగ, చాకలి, మంగలి, మొదలైన పనివాండ్లు కనిపిస్తారు.

[దేవాలయంతలుపు తీసిపెట్టబడి, పూజారి దేవతకు పసుపుకుంకమతో పూజచేస్తూవుంటాడు. ఒకవైపు తిత్తి, జమిలిక, పంపజోళ్ల వాయిద్యములతో బైనీళ్లు సుద్దులు చెప్తుతుంటారు. వాండ్లయెదురుగా గణాచార్లు శివాలాడుతుంటారు. కొందరు గణాచార్లను వీరతాళ్లతో ఫెళీఫెళీమని కొడుతుంటారు. గణాచార్లు యెదురుగా వేపమండలతో కట్టబడియున్న కల్లుకడవలకు దణ్ణాలు పెడుతుంటారు. వైరాలమూకుడులోని నిప్పులో గుగ్గిలంవేసి తలలువిరియబోసికొని గంతులు వేస్తూవున్న గణాచార్ల ముక్కులవద్ద పెడతారు. సభికులు, చూడటం, వినటం, ఆనందించటం అభినయిస్తుంటారు. ఒకప్రక్కన రెండుమేకలు మెడలో వేపమండలు కట్టబడి మొగాన పసుపుకుంకమ పూయబడి అరుస్తూ నిలుచుంటవి. వాటిని పట్టుకున్న మనిషి చేతిలోనే రెండు కోళ్లుగూడా వుంటవి. ఒకమనిషి వేపమండలతో కట్టబడిన ముద్రగడను పట్టుకొని యెగురుతుంటాడు]

బైనీడు:- పదింటి ఆసేరాన్ని అనుగుతుండం, నగరియేటను నరకటానికి సెలువేనా? సెలువేనా?

సభ్యులు:- సెలువే! సెలువే! సెలువే!

(మేకను లాక్కొనివచ్చి వధ్యశిలమీంద దాని మెడను పెట్టి అదిమిపడతారు. ముక్కులు నోరు గట్టిగా మూసిపడతారు. చాకలి, మాదిగ, వారి వారి కత్తులకున్నూ అమ్మవారికిన్నీ మొక్కులు మొక్కి, మేకను తెగవేయటానికి చాకలి చెయ్యి పైకెత్తి సభ్యులవైపు కూరమైన చూపు చూస్తాడు.)

(ప్రవేశం— నారాయణరావు, కమల.)

కమల:- (ఒక్క పరుగున వచ్చి వధ్యశిలమీందవున్న మేక మెడమీంద తన మెడపెట్టి పడిపోవును.)

నారా:- (విస విస వచ్చి పైకెత్తబడిన కత్తిని పైననే పట్టుకొనును.)

సభ్యులు:- (కలవరపాటుతో) యిదేంది, యిదేంది? (గొల్లుమని కేకలు) యేందండీ మీరు పోట్లాటకు వచ్చారా యేం? మా దేవతకు మేము జాతర చేసుకుంటుంటే మీరు అడ్డం రావటం యేందీ?

నారా:- పోట్లాటకు రాలేదు. మిమ్మల్ని బ్రతిమిలాడుకుందామని వచ్చాను.

ఒక సభ్యుడు:- మమ్మల్ని బతిమిలాడే దేంది?

నారా:- కనికరం, జాలి, దయ, మనసుల్లో వుంచండి నాయనలారా! అని చేతులెత్తి మీకు దణ్ణం పెట్టి ప్రార్థిస్తున్నాను.

ఒకసభ్యుడు:- లేక-యిప్పుడు మేము చేసిన తప్పేందీ?

నారా:- మనవంటి ప్రాణిని నరకపోతున్నారు.

ఇంకొకడు:- మనవంటి పేణిని మేము లాక్కరాలేదే? ఆమే వచ్చిపడిందిగా! యేవమ్మా నిన్ను రమ్మన్న దెవరు? మమ్మల్ని యీనిందెపాలు చెయ్యమన్న దెవరు?

కమల:- నాయనలారా! కోపపడకండి. నాకై నేనేవచ్చాను.

నారా:- ప్రాణం అంటే ఆమెదే కాదు, యీ మేకది కూడాను.

కమల:- ఈ మేకకు బదులుగా నాప్రాణం అర్పిద్దామని నేను సంతోషంగా వచ్చాను. మీరు నిరుత్సాహపడక నన్ను నరికి వెయ్యండి. వీటికంటె నరబలి యింకా యెక్కువైనది కదా!!

సభ్యులు:-(తెల్లపోయి ఒకరిమొహం ఒకరు చూచుకుంటారు.)

కమల:- (కత్తియెత్తినవానినిచూచి) ఊ...కానీ...వెంటనే నీపని నెరవేర్చు. దేవత ఆడది కాబట్టి, ఆడదాని ప్రాణాలు పుచ్చుకోవటం ఆమెకు మరింతయిష్టం.

నారా:- ఊ! త్వరపడండి. ఇది మంచికార్యం అని తోచినప్పుడు ఆలస్యం పనికిరాదు.

చాకలి:- (పైకెత్తినచెయ్యి గడగడ వణికిస్తూ) అమ్మా! ఆడకూతుర్ని అత్తైచేసేదా? నాకడుపులో యేదో యికారంపుట్టింది. కండ్లు చీకట్లు కమ్ముతుండాయ్. (కత్తివదిలేసి కండ్లుమూసుకుని కూల పడును.)

నారా:- నాయనా! మనిషిప్రాణం తియ్యటానికి నీకు మనసొప్పకపాయెనే! మేకప్రాణం మటుకు యెట్లా తీద్దామనుకున్నావ్రాయ్! మనిషిప్రాణం కంటె మేకప్రాణం యే విధంగా తక్కువనుకున్నావ్రాయ్. మనిషి కాల్లో వాడిగల ముల్లుగుచ్చుకుంటే యెంత విలవిల్లాడుతాడో, మేకకు అదేముల్లు గుచ్చుకుంటే తక్కువబాధ అనుభవిస్తుందని నీవు చెప్పగలవా? పుట్టినశిశువుమీద మనుష్యుల్లో తల్లికెంత మమకారమో, మేకకొదమమీద తల్లిమేకకు అంతకంటె తక్కువ మమకారం నీకెప్పుడైనా కనుపించిందా? రూపాల్లో భేదమున్నట్టే, జీవుల్లో భేదమున్నట్టు నీకెట్లా తోచిందోయ్ సెరిత్రమ్మడూ!!

చాకలి:- (నిరుత్తరం)

సభ్యుడు:- ఇట్టాటి సన్నజీవాలు సెక్తికి ఆగారం కింద యేర్పడ్డవయ్యా!

నారా:- ఆ తల్లి యిట్లాంటిజీవాలను హింసచేసి ఆహారం పెట్టమంటుందా? ఆ సన్నజీవాలకు మాత్రం ఆమె తల్లికాదూ? నీకూ నాకేనా ఆమె మాత? లోకమాతకదూ!! అట్లాంటి సంగతిలో యీ చెడ్డపని ఆమెకుమాత్రం యిష్టమౌతుందనుకున్నారా? కాదు. నిజంసంగతేమిటంటే:- ఆమెపేరుపెట్టి వీటిని చంపటం, ఆమాంసాన్ని మనం తినటం మరిగినాము. దేవతదిపేరు, మనది నోరు; అంతేకదూ?

సభ్యుడు:- మరి గేమదేవతకు యేమాగారం యియ్యాలండీ? ఆదేవతకు మాంసం ముఖ్యంకదండీ?

నారా:- ఓయ్ పిచ్చివాడా! ప్రాణులను రక్షించేది దేవత అవుతుందిగాని, భక్షించేది దేవత యెట్లాఅవుతుందయ్యా, దయ్యమౌతుందిగాని—

సభ్యుడు:- అయ్యోవ్! మీ కాంగ్రెసుపాదం పట్టినోళ్లకి మేము జబాబు చెప్పగలిగుండామా? సరే, మీరు చెప్పినట్లు, యీపని మానుకుంటాము. ఇక యెట్లాజరగాలెనో మీరే సెలవియ్యండి, మీమాట యిదిమాత్రం యినకపోవటం యెందుకు? యెంకయ్య యేమన్నాడు?

నారా:- వెంకయ్య పంపు తేనే వచ్చాను. నా మాటలు వెంకయ్య మాటలే! మే మిప్పుడు భూదేవతకు గుడికట్టిచ్చామే అదే మనగ్రామదేవతగుడి. అందులో దేవతే మన గ్రామదేవత; మన భరతమాత; మన ఆదిశక్తి. శక్తి లేనిదే యెవ్వరమూ యేపనీ చెయ్యలేముగా! కాబట్టి శక్తిని అందరమూ అనుసరించాలిసిందే! సేవించాలిసిందే. ఆమె జీవహింసకోరదు. కొబ్బరికాయలు, పండ్లు, పూలు, అన్నము, నీళ్లు, యిట్లాంటివి కోరుతుంది. వాటిని యవ్వరికీ యేబాధా లేకుండా మనం సంపాదించి పెట్టవచ్చును. రేపా దేవతను కొలుద్దాం రండి.

ఒకసభ్యుడు:- ఇప్పుడు నోటికాడిది తీసినందుకు, యీదేవతకు కోపమొచ్చి యెవరినెత్తుకుపోతుందో—యెంతమందిని మింగుతుందో!

కమల:- మింగేది దేవత కాదని పంతులుగారు చెపుతూవుంటే వినలేదు? అంతగా అట్లాంటి విపత్తు ఏదైనా సంభవిస్తే నన్ను బలియివ్వండి. నేనీ ప్రకారం రాసిస్తాను పట్టండి.

సభ్యుడు:- గ్రామంలో గొడ్లకుగాని, మనుష్యులకుగాని యేవైనా రోగాలు ఆశిస్తే, యీ దేవతకు మామూలుగా ముడుపులు కట్టుకోని కొలుచుకుంటున్నాము. అప్పటికా రోగాలు నిలిచిపోతున్నయ్. యిప్పుడా కొత్తదేవతను కొలిస్తే యేదైనా

వాళిపిలొచ్చినప్పుడు ఆగేతట్టుచెయ్యగలోండ్లు మీరు అమీ యిస్తారా?

నారా:- ఇప్పుడు మనగ్రామంలో నగటున అనగా నూటికి యెన్నిజీవాలు పోతున్నవో అంతకంటె యెక్కువ చచ్చిపోకుండా పూచిపడతాను. ఇంకా అంతకంటె చాలాతక్కువగా కర్చుపడే లాగు ప్రయత్నంచేస్తాను. సమ్మతమేనా?

సభ్యులు:- (ఏకగ్రీవంగా) ఇంక నూతు భయమేమున్నది? మీయిష్టప్రకారమే చేద్దాం.

నారా:- సరే! రేపు భూదేవిమీది పదాలు పాడుకుంటూ గ్రామప్రదక్షిణం చేసి గుడిదగ్గిరకు అందరము వెళ్లి దేవతకు పూజా పునస్కారాలుచేసి, కొబ్బరికాయలు కొట్టి "కనిపెట్టిఉండమ్మా" అని ప్రార్థన్ను చేసివద్దాం.

కమల:- ఆదేవిదగ్గిర యీలాంటి భీతి, వికారం, పైత్యోద్రేకం కలుగజేసే వాయిద్యాలు, పొగలు, గంతులు, త్రాగుళ్లు అల్లర్లు, పనికరావు. మనస్సుకు నిలకడచిక్కే, ఒళ్లు పులకరించే, కండ్లవెంట బొట బొట నీళ్లుకారే, భక్తిపూర్వకమైన పాటలు ఆటలు మాత్రమే కావలెనని గూడా మనవిచేస్తున్నాము.

(తెర)

# రంగము—౪

ప్రదేశము:— గ్రామవీధి

ప్రవేశము:- వెంకయ్య, రాములు, నారాయణరావు, కాంతయ్య లక్ష్మయ్య, భూదేవి, మంగమ్మ, కమల, ఇంకా గ్రామంలో జనులు.

(కొందరు పూలు, పండ్లు, హారతికర్పూరం, ఊదుకడ్డీలు మొదలైన పూజాద్రవ్యములు వుంచబడిన పళ్లెరములు బుజమున పెట్టుకొని ఉల్లడక్రింద వుంటారు. రాట్నపతాకం వెంట వుంటుంది.)

## పాట

౧

అందరూ:—

శ్రీమహాభూదేవి - శ్రీశుపట్టపురాణి
పాలించు గీర్వాణి - భగవతీ పూబోడి
అమ్మలలో నీవు మిన్నా!
మాకింక
అన్యదేవతలు సున్నా!!

౨

బంగారు జలతారు - పైరుచీరలగట్టి
పంటరెకల తొడిగి - కంట కాటుకపెట్టి
పొడుపు ప్రొద్దును నొసటనూ!
భూదేవి
బొట్టుగా పెట్టినావే!!

౩

కన్నావు పెంచావు - కౌగిలిలొ చేర్చావు
కడకు వదలక మాకు - కడుపొప్పగించావు
ప్రేమగల తల్లివమ్మా!
భూదేవి
పెద్దముత్తైదువమ్మా!!

౪

నిను నమ్ముకొని మేము - నిరతంబు నీసేవ
యొనరించుకొను మాకు - ఒక్కింత నీ యోర్పు
ఒసగి కాపాడవమ్మా!
భూదేవి
యొరుల నిక నమ్మమమ్మా!!

౫

సత్యంబు దయయును - శాంతమహింసలును
నిత్యజీవితముగా - నెరపి మాకాలంబు
శాంతియుతముగ జేయుమా!
మాయమ్మ
వంతలన్నియు దీర్చుమా!!

( తెరమెత్తగా భూదేవి గుడి కనుపించును. )

కాంతః- మన భారతజాతికి చిహ్నమైన యీ రాట్న పతాకాన్ని దేవత కెదురుగా ప్రతిష్ఠించాలి. అందుకు అన్నివిధాల వెంకయ్య అర్హుడు.

అందరూః- (ఏకగ్రీవముగా) అవును, వెంకయ్య, వెంకయ్య.

వెంకయ్యః- ( పతాకాన్ని అమ్మవారికి అభిముఖంగా ప్రతిష్ఠిస్తాడు. )

వెంకయ్య, నారాయణరావుః-

జెండా పాట

జై జై భారత - జాతిపతాకమ!
నిత్యజీవివై - నెగడుపతాకమ!!

౧

రంగుభేద మే - ర్పడుట తెలిసికొని
రంగులైక్యముజేయు - రాట్నపతాకమ ॥జై॥

౨

భిన్నలక్ష్యముల - ఖిన్నపడకుడని
ఏకలక్ష్య మే - ర్పరచు పతాకము ॥జై॥

౩

కాయకష్టమును - కష్టసహిష్ణుత
తగునని దెల్పు ఆ - దర్శపతాకము ॥జై॥

౪

సర్వప్రాణులను - సమముగ జూచెడి
శాంతి సమరమున - సాగుపతాకము ॥జై॥

౫

సత్యమహింసా - స్వాతంత్ర్యంబుల
సారరూపమగు - శాంతిపతాకము ॥జై॥

౬

భారతీయులకు - ప్రాణాధారమౌ
ఖదర్పతాకమా! - కాంగ్రెస్పతాకమా!! ॥జై॥

రాము :- కాంతయ్యగారూ! మీరు తెలిసినోండ్లు. ఈ పసుపు కుంకుమ పండ్లు, అన్నీ తీసుకొని, అమ్మవారికి పూజ జరపండి!

కాంత :- (గుడిలో ప్రవేశించి దేవతకు పూజా నివేదనలు జరుపుతూవుంటాడు.)

వెంక :- నారాయణరావుగారూ! మనం మాత్రం ఇక్కడ ఊరక కూచ్చోటం మెందుకు? ఈ లోకమాత, భూదేవత పుట్టూ పూర్వోత్తరాలు చెప్పండి, వింటాము.

నారా :- వెంకయ్యా! నిన్నగాక మొన్న కండ్లు తెరిచిన నాకు, నీకంటె యెక్కువ యేమి తెలుసునని చెప్పేది. మన భూదేవి

మీద, మనభరతమాతమీద, మన ఆదిశక్తిమీద, ఎవరో ఒక కవి పద్యాలువ్రాశాడు. వాటిని యీ వుత్సాహసమయంలో చదువుతాను వినండి.

సిరి తోడికోడలు - శ్రీవిష్ణు భార్య,
క్షమగల యిల్లాలు - క్షాత్రస్వరూప,
అతిథిపూజలుచేయు - అన్నపూర్ణమ్మ,
పాతివ్రత్యము గోలు - పడని మానవతి,
కడుపార బిడ్డల - గనుచున్నతల్లి,
సంద్రునికౌగిట - చేరినబాల,
వయసు మీరని ఘన - వరమున్నపడతి,
ధర్మంబు తప్పక - తనరెడి యోగ్య,
పేరు భారతమాత - పెద్ద ముత్తైద.

* * *

ప్రేమతత్వము పుట్టి - పెరిగిననాడు,
సత్యంబు విడనాడ - జంకిననాడు
ధర్మంబు నాల్గు పా - దములతో నడిచి
ఈతిబాధలులేక - ఎసగిననాడు,
కళల తాయుష్యంబు - కలిగిననాడు,
ఆత్మలన్నియు జేరి - ఐక్యమగునాడు,
బంగారు ముక్కుతో - వజ్రాలదినుచు
కేగిగద్దలు కులికి - కేరిననాడు,
స్తంభాలు చరితలు - చదివించునాడు,
అక్క సెల్లెండ్రలో - అధికురాలగుచు
ఐశ్వర్య మెంతగా - అనుభవించినదొ.

* * *

పసమించినట్టి మా - భారతమాత
ఆగభోగాలతో - యమటలుబడెడి

తలలు గూడనియట్టి - తనయులకతన
జనుల పాల్జొరుగని - జననాథులుంట
కరవున బడిపోయి - కబళంబులేక
దౌర్భాగ్యజీవ్యైయె - తపియించుచుండె.

*　　　*　　　*

ఆసన్నమరణ్మైయె - అమ్మయున్నపుడు
నిదురమత్తుననుంట - నీతియే మనకు ?
తల్లిలేనట్టి సం - తతి యాదుమకట !
తమ దేశమాతను - ధర్మహీనముగ
భంగపెట్టుచు పరుల్ - వంచించునపుడు
అన్ని ప్రజ్ఞలతోడ - నలరారుచుండి
అన్యజాతికి వంగి - యుణగారతగున ?
మనవార లందరు - మన తల్లికొరకు
పలువిధంబుల బాధ - పడుచుండునపుడు
సరివారు మన్నైన - సానుభూతులను
కుప్పతిప్పలుగాగ - కురిపించునపుడు
బాధ్యతనెరుగని - ప్రభువులుపోయి
స్వేచ్ఛచేకురెడి సూ - చన లున్నయపుడు
ఎడనొక ర్పెడనొక - రేర్పడిపోయి
దాస్యంపుపలుకుల - దద్దయు బలికి
పెడవాదనలుచేసి - పేరునుమాపి
హిందుసంఘంబును - హీనంబుచేసి
పతన్మైమె పోకుండి - పరులు నవ్వెదరు.

*　　　*　　　*

జయ నిత్యకళ్యాణి - సర్వేశురాణి
బంగారుతల్లి రావా - పంటలవలంతి

జయ ధర్మదేవతా - జయము భూదేవి,

జైజై భరతమాత - జై సుతసమేత

జయము తల్లికి దిగ్వి - జయమగుగాత!

కమల:- భూదేవతకు......

అందరూ:- జై.

కమల:- భరతమాతకు...

అందరూ:- జై.

కమల:- మహాత్మాగాంధీకి...

అందరూ:- జై.

కాంత:- (గుడిలోనుంచి వెలుపలికి వచ్చును)

వెంక:- ఇంక మనం చెయ్యాలి సిందేముంది?

కాంత:- ఇక మన భారత భూమాత స్తవం కానివ్వండి.

**పాట**

(ఒక్కొక్క చరణం నారాయణరావు కమల చదువుచుండగా వానిని అందరూ కలిసి అనుసరింతురు.)

చలువ గలిగినమాత - సద్వంశ సంజాత

మాతలందరిమాత - మా భరతమాత॥

౧

మకుటమై వెలయు నా - మంచుకొండల చలువో!

మూడువైపులనున్న - మున్నీటి చలువయో!

గంగతల్లి మొదలు - కావేరివరకుగల

జీవనదులా చలువొ - దేవతల చలువయో ॥చ॥

౨

కాళిదాసునిబోలు - కవికుమారుల చలువా!
బుద్ధమునిచేసిన - బోధసుధ చలువా!!
తొల్లి గరుడునివలెను - తల్లిదాస్యముదీర్ప
తనువు తృణముగ జూచు - మన గాంధి చలువయో ॥చ॥

3

పాడిపంటలనిచ్చి - భాగ్యసంపదలిచ్చి
బిడ్డలను ప్రేమతో - పోషించుకొను చలువా!
ఇన్ని చలువలలోన - యే చలువ సోకినదొ
కడమతల్లుల కెల్ల - కన్నెర్రనై యొప్ప ॥చ॥

(తెర ఒయ్యారముగా)

(సంపూర్ణము)

# కొన్ని ప్రాంతీయ పదాలకు అర్థములు

| పుట | పంక్తి | మాటలు, అర్థములు |
|---|---|---|
| 1 | 17 | పుల్లెద్దు= తవుడురంగు యెద్దు |
| | | మేట = మొదట |
| | | గుల్లెద్దు = మొండితోకయెద్దు |
| | | అరిమేట = రెండవది |
| | | కర్రెద్దు = నల్లనియెద్దు |
| | | ఇనురు = తిరిగివచ్చేవైపు; నాల్గవయెద్దు |
| | | జిర్రెద్దు = కొమ్ములు పైకిలేచి ముందుకు వంగినయెద్దు |
| 2 | 4 | ఓవ్ = యెద్దులను ఆపుటకు సౌంజ్ఞగా యేర్పడినధ్వని |
| | 9 | తోకమడి = తోకక్రింది గూడు |
| | 14 | బట్టెద్దు = కొంత తవుడురంగు కొంతతెలుపురంగు కలది. |
| 3 | 3 | కలిమట్టు=దీనిఅసలుశబ్దము కలిపట్టు; గడ్డిఅంతాకలిపి పట్టుకునేపట్టు; అనగా కళ్లములో ఆఖరువాలు గడ్డితీయటం |
| | | గొరకొయ్యలు = అశ్వన్యాది మూడునక్షత్రములు |
| | 4 | పొలితిరుగుట = కళ్లం ఆరంభములో, అంత్యములో మాదిగవాడు ప్రార్థిస్తూ కళ్లంచుట్టూతిరిగే తంతు |
| | 12 | పొలోలిగా = అక్షయమగుగాక |
| | 15 | పొలియ పొలియో = అర్థంలేని పల్లవి, ఉళళళళ...హాయి అన్నట్టు |
| 4 | 9 | దండకట్ట=తూర్పారపొయ్యగా కళ్లంచివరను తాలూపొట్టుతో యేర్పడిన కట్ట |
| 6 | 4 | తూమెడు=32 మానికెలు. |
| | | అసింగము=అసహ్యము |
| | 13 | అంకెం=40 మానికెలు |
| | 19 | ఉక్కుడాలబస్తా=మూతికుట్టకుండా తాళ్లతోబిగించే బస్తా. |
| | 22 | అట్టెడ=జల్లెడ |
| 11 | 1 | ఆమనికాలం=పంటలు యిల్లుచేరేరోజులు |
| 12 | 9 | యలవలు, చలవలు=మిక్కిలి హీనపుకరీదు |
| | 12 | యిళాయిదుట్టలమిఠాయి=జిలేబి |
| | 22 | వరా=4 రూపాయలు |

| | | |
|---|---|---|
| 17 | 22 | కిడ్డిరచుట=బలపరచుట |
| 19 | 7 | గాతం=గడ్డి; మేత |
| 22 | 5 | నవలమో, దుగలమో=అర్ధరూపాయో, పావలో |
| 23 | 3 | అవారునతుకలు=200 |
| | 7 | పాలంగళ్లు=50 |
| | 18 | అంగళి=10 |
| | 19 | చెలెఅంగళ్లు=60 |
| | 26 | సార్ధయేకురు నతుకలు=150 |
| 26 | 13 | టలనతుకలు=800 |
| | 14 | పోగునతుకలు=400 |
| 27 | 3 | బావనెల్ల=అపాదమస్తకం తెల్లవన్నెగలది |
| 29 | 18 | ముచ్చవలము=రూపాయిన్నర |
| 30 | 23 | యీాయల్ దాక=ఇంతకులోపల |
| 49 | 12 | రెల్లలు=మెతుకలు |
| | 20 | తెవెలో=కంచములో |
| 51 | 26 | దావల దున్నిందో, యెలవలదున్నిందో=యెడమవైపు దున్నిందో, కుడివైపుదున్నిందో. |
| 52 | 2 | చొప్పతోపు=వెనుకకుత్రోయుటకు వీలుగా బండిమీద అమర్చబడిన చొప్ప |
| | 3 | వరి=కాడిబరువు |
| | 5 | తల్లేరుకాడి=బండిగాని అరకగాని బరువైనప్పుడు కాడి ముందు కట్టెడి మరియొకకాడి |
| 54 | 3 | యేరగలప=దున్నుటకు కావలసిన కొరముట్లు |
| | 15 | కుశాలుగ=సంతోషముగా |
| 56 | 4 | వశానము=చిల్లరదినుసులు అమ్ముట కేర్పడిన పొడుగు పాటి నూలుసంచి |
| 105 | 22 | నతెన్నరోజూ=అనుదినము |
| 108 | 7 | తితి=సుతివేయుట కేర్పడిన చర్మభస్త్రి |
| | | జమిలిక=లయకొరకు నరముపై మీటుట కేర్పడిన వాద్య విశేషము. |
| | | వంపజోళ్లు=డోలుకంటె చిన్నవిగావుండును. ఒకటి వీరణము రెండవది వంపజోడు; రెండు కలిసి వుండును; ఒక వైపు ఒకదానిమీద, రెండవవైపు రెండవదానిమీద వాయించెదరు. |

108 9 వీరత్రాళ్లు=శివమెత్తినవారిని కొట్టుట కేర్పడి ఒక వైపు మొనతేలిన లావుపాటి మోకుత్రాళ్ళు.

11 వైరాలమూకుడు=గ్రామదేవతకు దూపమువేయుటకు కుమ్మరిచేసిన వవితనముగల మూకుడు.

16 ముంద్రగడ=వేపమండలతో కట్టబడిన పొడగు వెదురుగడ.

17 పదింటి ఆసేరాన్ని=సభవారిని. నగరియేటు = ప్రభువుగారి మేకపోతు.

110 16 ఆగారం=ఆహారం.



# తప్పు ఒప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 2 | తొలు | తొలి |
| 6 | 2 | వచ్చుటి | వచ్చుడి |
| 7 | 4 | నీయెదనే | నీమెదుటనే |
| | 20 | ఊకాలె | నూకాలె |
| 9 | 7 | పై రయోరు | పైర్యోరు |
| 12 | 26 | వండ్లే | పండ్లే |
| 15 | 5 | యెంట్లు | వెంట్లు |
| 23 | 19 | చెలెరుకార్లు | చెలెలంగళ్లు |
| | 21 | మైయితే | మైతే |
| 30 | 20 | వెంకయ్యా | వెంకయ్యను |
| 32 | 14 | వైదుకుతూ | వదుకుతూ |
| 33 | 17 | పోతండే | పోతుండె |
| 35 | 9 | గొట్టం | కొట్టం |
| | 5 | దట్టేలు | దట్టేలు |
| 44 | 23 | కదూ | కదూ |
| 46 | 14 | సిఖ ండి | షిఖండి |
| | 17 | గొడో | గా డో |
| 49 | 20 | తెవలో | తెలెలో |
| 71 | 25 | నములతినాలి | నములుకతినాలి |
| 75 | 13 | నఖ | నబ |
| 90 | 5 | ముతావాడో | ముతావాండ్లో |
| 116 | 25 | యమటలుబడెడి | యటమటల్బడెడి |